పలనా డన్న దిగంతరాళములు సంభావించు వీరాగ్రణుల్
కలరేయన్న సమస్య లిచ్చటఁ బరిష్కారమ్మగున్ విచ్చుక
త్తులమైక మ్ముడివోవ నాఁడు బహుళాంధ్రుల్ చల్లురక్తాక్షతల్
తలపైఁ జిందినఁ బుల్కరించె గురజాలావీరభద్రేశుఁడున్.

# పరిచయము

పలనాటిగాథ కానుపాను అంతగా లేకపోఁగా నభూతకల్పన లెక్కుడైనవి. దీన నస లడుగంటి పిసరుమాత్రమే దక్కినది. కాఁగా నడుగడుగున నుచ్చావచములగు పురాణసంప్రదాయము లిరవుకొన్నవి. అందుచే నేఁడు ప్రచారమందున్న వీరగాథ మాఱట భారత మనిపించుకొన్నది. కొన్నియెడల నయ్యై ఘట్టములు తూ చాలు తప్ప కనుకరించినవి. ఎందైన రేఖామాత్రముగా సామ్యముండకపోదు గాని ప్రతిపద మిట్లు లగించుటచేఁ జరిత్రకు సంకెలవేసినట్లయినది. అనుశ్రుతిగా నాడుకొను నాయా పోలిక లించు కుటంకింతును.

| భారతము | పలనాటిచరిత్ర |
| --- | --- |
| అన్నదమ్ముల బిడ్డలు | ఒకతండ్రి బిడ్డలు |
| ధార్తరాష్ట్రులు, పాండవులు | నలగామాదులు, మలిదేవాదులు |
| సామ్రాజ్య విభజనము | రాష్ట్రవిభాగము |
| అక్షద్యూతము | కుక్కుటద్యూతము |
| అరణ్యావాసము | వలస |
| కృష్ణుని రాయబారము | అలరాజు రాయబారము |
| భగవద్గీత | బ్రహ్మగీత (చాపకూటిసిద్ధాంతములు) |
| యుద్ధము | యుద్ధము |

ఈ సాదృశ్యమూలమున బ్రహ్మనాదులకుఁ బలనాటి కృష్ణాద్యవ నామము లేర్పడినవి. రానురానివే భగవదంశలకై వారి చెయిదములను నలౌకిక కృత్యములుగాఁ బరిణమించినవి. వాని నొక తెన్నునకుఁ దెచ్చి చూపుదమన్న నయితిగాకున్నది.

నే గురజాలలో నున్నన్నినాళ్లను గడు వ్యయప్రయాసలకు లోనై చరిత్రపరిశోధనమేగాక దాదా పేఁబదిమంది కథకులమూలమున నీ గాథ

సాకల్యముగ వింటిని. అందలి సారాంశము చరిత్ర కనుగుణముగా నమర్చుకొని ప్రకృత కథ కుపక్రమించితిని. ఈ నాయకురా లందొక సన్నివేశము.

ఎడనెడ నలౌకికములుగాఁ దోఁచు మచ్చుముక్కలు కొన్ని మాత్రము సూచింతును.

నాయఁడు విష్ణ్వంశసంభూతుఁడగుట నొకరి మ్రొక్కు లందుటే గాని తానొకరికి మ్రొక్కఁగూడదన్న ప్రతీతిగలదు. అందుచే నలుగు రాజునకు మ్రొక్కవలయునెడ నిరువురిమధ్య నిల్పిన యుక్కుకంబ మగలి వ్రక్కలయ్యెననియు

బాలచంద్రుఁడు నలగొండమీఁదనుండి పొట్టేలును దూఁకింప దాని గిట్టలు చట్టులో దిగఁబడెననియు

మదనాల చిటిమల్లు తోడికోడి (పానుగంటి చట్టునందలి బెరస) గతించి పేరిందేవిగా జన్మించెననియు, అదియే యర్వదియాలు పల్లకీ లొక్కపెట్టున మట్టెననియు,

యోగశక్తి బ్రహ్మనాయని సాధింపఁ బలనాట నాయకురాలై జన్మించెననియు,

బ్రహ్మన్న కృష్ణాతీర్థమున మదుగుచేసిన మొసలి గర్భమునఁ గొన్నివాసరము లుండెననియు,

నేఁటికి నందందాడుకొను వృద్ధాచారము లెన్నియో గ్రంథస్థములై యున్నవి. వీనికి వెలియై గ్రంథము నడపిన నసలు పలనాటి చరిత్రయే కాదను శ్రోతలెందఱో కలరు. వీని నంటి నడిచినఁ జరిత్ర జిజ్ఞాసువుల కెంతేని రుచింపకపోవచ్చును. యథాతథముగఁ జిత్రించుటకా తగు నాధారములు లేవు. కనుకఁ బైఁజెప్పిన యుభయమార్గముల ననుసరించి ముకుసూటిగా నడువవలసి వచ్చినది. ఈ విషయమే 'మగువమాంచాల' యందించుక తడవితిని.

ఒక శ్రీనాథమహాకవి వినా చారవగల ప్రసిద్ధ కవులీకథ నుపే క్షించుటంజేసి దీనికిఁదగినంత విశ్వవ్యాప్తి చేకుఱలేదు. అక్కతన నెడ పెడఁ బలుశాఖల విస్తరిల్లుట కనువుపడినదిగాదు. అయినను జీవగాథ గానఁ దరతరములనుండి పల్లెపదాల నుజ్జీవించుచు వచ్చినది, నాఁడు నేఁడు వీరపూజాప్రసక్తి వచ్చినపుడెల్ల నాంధ్రు లీ వీరగాథ కఱ్ఱులుసాపక తప్పినదిగాదు. తన్మూలమున కవులదృష్టి క్రమక్రమముగా నీ చాయకు మరలినది. ఇదొక గాలిపాటు. ఇంతకుఁ బెరటిచెట్టు మందునకు వచ్చునా?

ఇట్లసటఁబడి మ్రగ్గుచున్నగాథ పూర్వకథార్థయుక్తిఁదక్క వలసి నట్లు చెప్పినచో దురవగాహము గాకమానదు. ఇందులకై కొందఱు మిత్రులు కథాసూచన చేయుమనిరి గాని ఇప్పట్లఁ బాఠకులు పాలుమాలక కొంచెము శ్రమకుఁ గావలసియుందురు. ఈమాత్ర వ్యాసంగమును నవసరమేమో?

అందందుఁ బ్రాంతీయ పదములకుఁ దెలివిడియు నవసరమని కొంద ఱాడుచు వచ్చిరి. ఆ మాదిరి పదములన్నియు సందర్భోచితము లగుటంజేసి సులభగ్రాహ్యములే యగునన్న నమ్మికతో విడిచిపుచ్చితిని.

ఈ పదసంకలన సందర్భమునఁ గొందఱు ప్రాంతీయము లనాదృ తములని పెక్కు జానుతెనుఁగు పదములు సజీవములు త్రోసిపుచ్చుట కద్దు, వీనిస్థానమున సంస్కృతాది భాషాపదము లెరవుదెచ్చికొనవలసి నదే కదా? కాదేని మినుసిగదేవర, సోఁకుమూఁకలగొంగ మొదలగు పదసమ్మేళనమునకుఁ బాల్పడకతీరునా? ఇందేది సముచితమందురు? ఏ నీరమైనను శంఖమునఁబోయక తీర్థమగునా?

ప్రత్యేరములగు తెలుఁగు పదములు నెయ్యము, వియ్య మిత్యాదు లైదువందలకు లోపని తజ్జ్ఞు లెఱుఁగనిదిగాదు. అందు నిత్యవ్యవహార ధోరణికి ముప్పా లన్యదేశీయమే శరణ్యమైనది. ఈ తతంగములలోఁ బైవానినెల్లఁ ద్రోసిరాజనిన మన భాష కెదుగుఁబొదుగు లేర్పడఁగలవా?

మార్పు లెందేని సాజములు. అయినను నేలవిడిచిన సాము కూడదు. అందును మంచిచెడుగు లేర్పరించుకొను టుత్తమము.

ఇదిగా సంగంజాగర్లమూడిలో సారస్వతమండలి నెలకొల్పితిమి. ఇప్పటి కది యేడాదిబిడ్డయైనది, అంగబల మర్థబల మంతగాఁ జేకూర కున్నను శ్రీమంతులబిడ్డ, దాని కెందు లోటువాటిల్లును ? లలితకళాభి మానులు శ్రీ జంపాల శ్యామసుందర ప్రసాదుబాబుగారి ముద్దుముచ్చటల కైనది. తదభ్యున్నతి కేము నిమిత్తమాత్రుల మైనను భారమంతయు బాబుగారిదే.

ఈ మండలినుండి నేఁటి కాఱు గ్రంథములు వెలువరింపఁ గలి గితిమి. ఈ యాఱవపుష్ప మీ మండలిసభ్యులు పూజ్యులు నగు శ్రీ వేంకటనృసింహపండితుని ప్రేమార్చన కై యిరువాఁగుల ప్రేమబంధమున కంకితమైనది.

ఈ సారస్వతసేవ తెలుఁగుతల్లి కేమూలకగును ? అయినఁ జంద్రున కొక నూలుపోఁగన్న సామెతకుమాత్ర మైతిమి.

నా యీ యుద్యమమున కన్నివిధములఁ జేదోడు వాదోడై పలు విధములఁ బ్రోత్సహించు మిత్రకోటికెంతయుఁ గృతజ్ఞుఁడను.

రేవగలు నా కవితావ్యాసంగములఁ బాల్గొని కష్టసుఖములం దెల్ల యెడల నేనై వ్యవహరించు సోదరుఁడు రవిబాబునకు (క్రొత్త సూర్య నారాయణ) సాధువాదములు.

—గ్రంథకర్త



కృతికర్త:
ఉభయభాషాప్రవీణ
'టుకూరి వేంకటనరసయ్యగారు



కృతిభర్త:
ఉభయభాషాప్రవీణ
జంపాల వేంకటనృసింహముగారు

# కృతిపతి

## ఉభయభాషాప్రవీణ

# శ్రీ జంపాల వేంకట నృసింహముగారు

శ్రీరస్తని ప్రాచీనా
చారాదికమున కొకింత సమ్మతిపడి మే
మారాధించు తెలుంగుం
భారతి కృతిపతికిఁ దోడుపడు నెల్లెడలన్.

పది పదునాఱేండ్లకు మును
పెదియో సందర్భ మెఱుఁగ నీ కృతినాథుం
డెదురుపడ *మా నిరంజను
సదనాంగణ భూమిఁ దటిసి సంశయమతినై.

ఎవ రీ నైష్ఠికసుందరుండు ననుఁ బ్రత్యేకించి క్రీఁగన్నులన్
దవిలెన్ వైష్ణవులా మతేమి? యని ప్రస్తావింప మిత్రుం డిటుల్
వివరించెన్ మనకమ్మవారె కవులున్ విద్వాంసులున్ నీ వెఱుం
గవె? జంపాల కులప్రశస్తికి నుపోద్ఘాతమ్ము లే దందురే?

---

* కవిశేఖర శ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు.

అనివన్ గుప్తికిఁ దెచ్చుకొంటి నదిగా నల్లంత కేలోన్మడ్చితిన్
దన లేనవ్వుల నైతి నిర్మలమున స్సత్త్వమ్ము గుర్తించితిన్
గనులన్ ద్రావితిఁ గాంతుఁ జేసితిఁ గళాకళ్యాణ మరాహించితిన్
దనకు న్నా కపుడైన మైత్రి కిఁకఁ దాత్పర్యమ్ము వేరున్నదా?

కనిపింపన్ కవిరత్నమా! యని చమత్కారమ్ముగాఁ బ్రేమగాఁ
జనవున్ సౌహృద ముప్పతిల్ల నిజవాత్సల్యమ్ము చిప్పిల్ల న
న్ననుకంపాదృతిఁ దన్ను మిత్రము బహిఃప్రాణమ్ము తత్పూజన
మ్మున కీనిస్తుల దివ్యకావ్య కుసుమమ్ముల్ నెమ్మి నర్పించెదన్

చేతఃపుష్టికి సత్కళాభజనమున్ జిహ్వాగ్ర సంతుష్టికిన్
సీతారామ పవిత్రనామ జపమున్ సేవాపరాకాష్ఠకున్
బ్రాతఃకాలికభూతయజ్ఞ మని సంభావించు నాంధ్రాళికిన్
బ్రీతిం గొల్పెద నేతదన్వయకథా పీయూషవాగ్ధారలన్.

ద్రవిడోర్వీవిభవాభిరామ మతులాంధ్రక్ష్మాతలం బందు సం
స్తవనీయాన్వయశాఖ లున్న వచటన్ జంపాలవంశ్యుల్ బుధ
ప్రవరుల్ నైతికకార్యఖడ్గవిషయప్రామాణికుల్ తత్కళా
ద్రవిణద్రోణములన్ ద్రవింపని మహార్థ మ్మాంధ్రి కొండున్నదే?

ఆవంశస్థిరకీర్తి కైన ఘనుఁ డుద్యద్దానధారాపర
ప్రావృడ్బంధువు లక్ష్మనీఁడు తన క్షాత్రక్షేత్రమా దుగ్గిరా
లావాసమ్ముగ ఛత్రచామరసమేతాందోళికాకేళికా
నీవృత్తుండయి త్యాగభోగములఁ దన్పెన్ బంధుబృందమ్ములన్

అమ్మహామహు సుతపంచకమ్మునందు
బుచ్చిపీఁ డతివిఖ్యాతపూరుషుండు
వాని కుదయించి రార్వురు సూను లందు
సుందనార్యుఁడు కడగొట్టు నందనుండు.

ఆసుకృతి గన్న పుత్రత్రయమునయందు
రాయఁ డధ్యాత్మ విద్యాపరాయణుండు
తనకుఁ బొడమిరి నలువురు తనయు లందు
నమిత సాధువు మన బాపయాభిధుండు.

దేవాత్మమ్మ వరించిన
భావజ్ఞుఁడై కుటిలజటిలపాపపరీతా
పావకుఁడై గురుజనపద
సేవకుఁడై నెగడె నతఁడు సిద్ధార్థుఁ డనన్.

పతి దేవతగా సుతుఁడే
గతిగాఁ బరహితము తానుగా దేవాత్మ
సతి కాలమ్ము గ్రమించెను
ప్రతి లే రపు డామె కాంధ్రభామల నెందున్.

ఆ దివ్యదంపతులకు శు
భోదర్కమ్మగ నృసింహుఁ డుదయించెఁ దదీ
యాదర్శ పురుషు లయ్యా
న్నాదుల చరితమ్ము నాల్కఁ గందదు వొగడన్.

అయ్యనప్రభు వార్యమర్యాదగలఁడు
సుబ్బరాయఁడు భువనవిశ్రుతయశుండు
వేంకటేశము ప్రభుధర్మవిభవగురుఁడు
సాంబయాగ్రణి పరహితాచరణచణుఁడు

వారి నామజపమె తారకపఠనమ్ము
ప్రత్యహము నృసింహపండితునకుఁ
దా సృజించుకొన్న దైవమ్మునకు సైత
మింతభక్తి సూపఁ డేమికతమొ ?

తన మధురాకృతిన్ గనులఁ ద్రావితిఁగాని పసందుగాఁ బ్రజా
మనముల కెక్కఁజెప్పుటకు మాత్రము గాను పసిండిచందమా
మనుకొనుఁ డంతకన్న మెఱుఁగన్న సరే? ప్రతిలేని తత్కళా
ధనమున కాదరోదరసుధామధురోక్తుల కాసచేసితిన్.

అతిథిసపర్య కాహ్లాదయ మంకిత మావ్యవహారకాండకున్
బ్రతి నహి నాఁడునేఁడు* తనపండితపీఠ మఖండసాహితీ
వ్రతముల కాలవాల మిటువంటి కవుల్ రసికుల్ బుధాగ్రణుల్
కృతిపతులైన మాదృశుల కీర్తికిఁ గీర్తి ఘటిల్ల కుండునే?

నన్నయఁ దొట్టి పూర్వకవినాథుల గట్టునఁ ద్రేఁచినాఁడు వి
ద్వన్నుత నవ్యకావ్యకవితావిధులన్ గమనించినాఁడు మా
తెన్నులు మెచ్చినాఁడు తమిదీఱ కదేకృతి కిచ్చగించి నాఁ
డిన్నిటి కైనవారి హితమేకృతపుణ్యులకో లభించెడున్.

* ఈ స్థానము తనశాఖలోఁ బాతికేండ్లకు మునుపు తనకొక్కనికే కైవసమయినది.

అనిబద్ధ ఖండకావ్యము
లను పెక్కు సృజించె నీకళాపూర్ణుం డొ
ష్పుని తృష్ణ గూరి చిల్లర
పనితనము వెలార్ప నిష్టపడరు ప్రసిద్ధుల్.

ఇహపరముల కంగవించు నర్ధాంగితోఁ
గావ్యలక్ష్మితో నఖండభోగ
మనుభవించు సుకృతి తన కావ్యకన్యల
నయిన కడకు నిలు వెలార్పకున్న ?

తన సతీమణి హనుమాంబ కనుఁగుఁ గోడు
నాయురాలిని జేపట్టి నాఁడు నేఁడు
అందఱకుఁ దలలో నాల్కయైన దానె
విశ్వజీవాగ్రములఁ దాండవించు నీమె.

"అన్నపూర్ణకు నుద్దియా నతని గృహిణి"
అన్న పెద్దన్న నుడు లాపె కన్పించు
మడసిగ్రాస మాపె హస్తమునయందు
నడికి కేడైన విశ్రాంతి పడయ దన్న !

పలువుర ప్రెమోల సంభాషింప దొరఁకొన్నఁ
గంతమ్ము గవ్వల గలబరించు
హద మొత్తి గరగరల్ పచరింపఁ దలకొన్న
గంటమ్ము ముస్తాపోకడలఁ గులుకు

తన వాఁ డితం డని దరిఁజేర నీకొన్నఁ
జెలిమి కోటికిఁ గోటి చేసి తీరు
అవసర మ్మగు కార్య మంతైన నింతైనఁ
గలిమి కర్పూరమై కరఁగిపోవు
నితఁ *డుపాధ్యాయమాత్రుఁడా? యీ తెలుంగు
పరగణాల కఖండ తపః ఫలంబు
తద్యశోలతిక ల్దిగ్దిగంతరములందు
నాంధ్ర సాహిత్యతీర్థమ్ము లాడుఁగాత!

* శ్రీ చౌదరిగారు మగ్గిరాల హైస్కూలునందుఁ బ్రధానాంధ్రోపాధ్యాయులు.

# నాయకురాలు

## ప్రథమఖండము

ద్వాదశ శతాబ్ద యుద్ధ గాథలు మథింప
బయలుపడ్డ ప్రతాపాగ్ని భస్మమయ్యెఁ
బల్లెనా డస్మ దాంధ్ర ప్రపంచమునకుఁ
పౌరుషజ్యోతియని పేరువడిన దపుడు.

నాఁటి రణకథ లూఁకొన్న నాగులేరు
గుండెనీఱయి పరువిడుచుండు నెపుడు
కుమిలియేడ్చుతరంగ గర్భములనుండి
వెలువరింపక దాఁచె మా వీరగాథ

ఆమహాత్ముల పాదవిన్యాసములకు
నీ శిలాపంక్తు లాడుగు లర్పించుకొనియె
సంతఁ దనివోక రేవగ లబ్జుసాఁచి
మోయుచున్నవి తన్నామముద్ర లిపుడు

బాలవీరుల రక్తస్రవంతు లెన్ని
పొంగి, పొరలెనో? కార్యమపూడిలోన
నేఁటికా "వీరబయళుల" నెత్రుకూడు
జీర్ణమయి కాక త్రేఁచు మా జీవభూమి.

గ్రక్కుదల్చినచో ఘట్టఘట్టమందు
నుగ్రభండనపాండిత్య ముగ్గడించు
వీరగాథల నొకమారు విన్నఁజాలుఁ
గోఁచకొల్లైనఁ గత్తులఁ గొలువుదీరు.

ఇంత కెన్మిదివందల యేండ్లనాఁటి
ఈ మహాప్రళయమునకు హేతుభూత
ముక్కుపిండ మొకానొకం డుద్భవించి
ఉజ్జ్వలాశాసదస్సు లుజ్జూఁతలూఁచె.

ఆమహావ్యక్తి మిట్టమధ్యాహ్నవేళ
జిట్టగామాలపాటి పచ్చికబయళ్ళ
గోగణంబుల మేపుచు గొంతు లెత్తి
వ్రేళ్ళతో "సమ్మగా" గంగడోళ్ళు నిమురు.

గుబ్బకొమ్ముల మిట్ట గోరాడి ఱంపిల్లు
మలపకోడెల పడావులకు మెచ్చి
పుట్టచెండ్లసియాడ బుసకొట్టి మారొక్కను
పోట్ల గిత్తల కుస్తిపట్ల కలరి.

నింపాదిగాఁబండి నెమరు వేసెడునెడ్ల
సింగారముల కాత్మఁ బొంగిపోయి
చిత్తు బెత్తుగఁ దోఁక లెత్తి క్రేళ్ళుటికెడు
తఱపిదూడల జబ్బచఱచి మురిసి

కంట వత్తిడుకొని నిల్వుగాళ్ళ నిలిచి
రేక మోవక కాచు మాఱెడ్డిరాణి
మూఁగబిడ్డలతో నెట్లు ప్రేఁగఁ గలదో?
గంపెడుబలంగ మున్న దీకర్మమేల?

పండ్లూట మెసవెడు పాడియావులనోటి
కందిచ్చుఁ బిడికిళ్ళ నారుగంటు
లుట్టంకి దుబ్బుల కట్టాడునట్టుల
నెగఁద్రోలుఁ గుందురుటీరములకు
ముసిముట్టకందంద మూచూచు లేఁగలఁ
బట్టించు లేఁబచ్చి బాడవలకు
నవఁతగూరివగర్చు నకోఁ-రుపశువులఁ
బడఁద్రోలుఁ దెలిసీటి మడుఁగులందు

ఒకటవిసువక యంతంతకుత్సహించి
ఇంటబైట నిరంతర మేకదీక్షఁ
బశుగణంబుల యెడ బంధుభావమొనసి
సేవ లొనరించు మాఱైతుచిన్న దపుడు.

బసవదేవులకేలొకో పల్లెనాటఁ
పేరుమ్రోసిన పెద్దలపేళ్లు పెట్టి
సారెసారెకు బుజ్జవమ్మారఁ బిలుచుఁ
పరులగుండెలు, ప్రేవులు ముఱిగిపోవ.

బ్రహ్మన్న పేరెత్త బాపన వెల్లెద్దు
మండిగాలిడి ముందు సందడించు
బాదన్న, రమ్మన్నఁ బరువెత్తి బొల్లెద్దు
పంగకొమ్ముల పట్టి బయులు చిమ్ము
పెదమల్లుఁ డెటనన్నఁ బెరరేఁగి కఱికోడె
చిగురుగిట్టలు ప్రేలఁ జెంగలించు
బాలుఁ డెందన్న మువ్వలగిత్త కాళ్ళెఁ
జాచి ఖణిల్లని జంకెవేయు

ఈమహాహేళనమున యందే భవిష్య
దర్థ మిమిడినదో ? మన కంతుపట్టు
దిదొక హేలగఁ గడపిన దింతఁబోక
పశులఁ గెరలించి జగడాలపాలొనర్చె.

ఉబుసుపోకకు నొండొంటి కుజ్జిచూచి
తలలు తాఁకించి విడిచి తా నిలిచిచూచు
అసలె పశువు లీఁకంబులో నకట-సాంబు
కాన వానిని బట్టఁ బగ్గాలు లేవు

తొలుదొల్తఁ దోఁక లార్చుచుఁ
దల లిచ్చుచుఁ గొమ్ముఁ గొమ్ము దాటించుచు మో
రల నెరుముకొనుచుఁ దుదకుం
దలపడినవి నోట నుర్వ ♦దబ్బలు వడఁగన్.

ఎత్తినతోఁక లెత్తినట్టులే నటియింప శిరఃప్రదేశముల్
నెత్తుట జొత్తిలన్ గనుల నిప్పులు రాలఁ గడిందిజబ్బ లు
వ్వెత్తువడంక మూఁపులట్టిప్పిఁ బెటిల్లని కొమ్ము లెమ్ములున్
దుత్తుమురై పడన్ జెలిక దుమ్మయి దుగ్గయిపోయె నొక్కటన్.

గడగడఁ గొన్ని గోలిదిరుగన్ మఱికొన్ని వగర్చి నిల్వఁ గొ
న్నడపెడఁ బోరఁ గొన్ని తల లిచ్చి తలంకఁ గడంకఁ దక్కొకా
బిడ కదుపుం బదింబదిఁ గవించు గదించు నిఁ కంతకంతకున్
విడివడి పోరిపోరి గొసవెట్టి పసుల్ పరువెత్తు చున్నడన్.

పరువిడుగుంపుల న్మలపి బాదముపీరుల బుద్ధులెవ్వరో?
కఱపిరి పాఱువారు నలగామనృపాలుని గడ్డ దిన్నచో
గుఱిపడవచ్చు మీ పిఱికికొమ్ములు మూరెడు బారెడున్న మా
కొరగినదేమి?మీయసువు లూడ్చిన మెప్పొలయున్ధ్రువమ్ముగన్

దోసము లే దిఁకేమనిన దుర్మదు లీ పలనాటివారికిన్
రోసము లేదు నేఁడు బరిద్రొక్కి కశాపికలైన మీ కసల్
మీసము లేదు మానృపతిమీఁద నవాళ్ళిడు కోఁచకోళ్ళకున్
మోసము లే దదెట్లొ మునుముందు బయల్పడు నిబ్బరమ్ముగన్

♦ 'దొబ్బ'ప రూపాంతరము.

నీతికి నిల్చి మా పరువు నిల్పిన దీబసవం డొకండె నీ
జాతికి బుద్ధిసెప్ప మిఁక జన్మ నిరర్థకమంచు నీవలెన్
భీతిఁ దొఱంగిపోరు నొక వీరుఁడు గల్గినఁ బల్లెనాటి దు
ర్జాతులకాళ్ళుగట్టి వరుసన్నఱకింపనె? పేరుపేరునన్.

నాయీముద్దుల కోడెకుంబసిఁడి పెండారమ్ము వేయించి పై
వ్రాయింతున్ బలనాటి ప్రస్తుతవిచిత్రవ్యక్తులన్ దీనితో
మ్రోయుం బల్లెలు, పట్టణంబులపు డామోదింతురో నాతలన్
వ్రేయంజూతురొ? తేల్చుకొందు నతిగర్వీభూతచేతస్కనై.

ఇది యుపశ్రుతిగాఁ దోఁచెనింక మీఁద
సైపరాదని లోలోన సణుగుకొనుచుఁ
బసినదల్పుచు నటునిటు పఱచువేళ
మేనమా మఁట రొప్పుచా మెలఁత డాసి

## సింగారెడ్డి

ఓసి నిర్భాగ్యురాల! ప్రొద్దోసరిల్లి
గడియసే పైన దింటిమొగంబుగావు
చావుబ్రదుకులఁదండ్రి వాపోవ నిచటఁ
బచ్చికలివోదు నీతలపండు వగుల.

పదపద గొడ్డుగోదలనెపంబున శేవగ లిల్లువాఁకిలిన్
వదలితి వింటబైటఁ బయివాఁ డసిదోఁడొకఁడున్న స్వేచ్ఛగా

మెదలనవచ్చు నీతలకుమించిన బంటెడుకాఁపురమ్ము ని
య్యెదనున నెట్టు లీఁదఁగల వాకునపోఁకన పొంద వింతకున్

## నాయకురాలు

ఏమనుకొంటివో! భువన మీచిటివ్రేలున ద్రిప్పుదాననో
మామ! వృథా విచారపడిమాత్రము నన్ననకయ్య కింతలో
నేమి మునించె వైద్యులెవ రేమని రీ విట కేల వచ్చి తీ
తామస మెందు కిప్పుడకదా పొదలెన్ దొలిసంజకానుపుల్ !

అల పలనాటి పెద్దల బలాబలపౌరుష తారతమ్యముల్
కొలుచుచునుంటి నిందనుక గుడ్డము దాపునఁదారసిల్లి యె
డ్లలసిన వియ్యపశ్రుతి మదాశయముల్ పెరరేఁచె గోవులన్
మలపుము పోదమంచుఁ దనమామనొకించుక హెచ్చరించినన్.

కదుపు నదల్చిడొంకదరి ఖండములం బడఁద్రోలి గుంపులోఁ
జెదరినవానిఁ గంచెలకుఁ జేరినవానిని గూడఁదీసి య
మ్మదవతితో నతండు గృహమార్గమువట్టెదినాంతహృత్తమో
హ్రాదములు పొంగి పొర్లి సుడులై సుడులై కడ లాక్రమింపఁగన్

# నా య కు రా లు

## ద్వితీయఖండము

చౌదరి రామిరెడ్డి విజయయ్య రుజార్తిఁ గలంగుచున్ మనో
వేదన నిట్లనున్ బసిడి వేళకుఁ బాళకు రా దదేమొ ? నా
కేదరిదోఁచ దీ ఘుట మొకించుక చేతికి రాదు పైఁగ నా
బాదమవారితోడఁ బగఁబట్టిన దే మగునో కదే తుదిన్.

ముదుకఁడఁగా, మఱింకఁ దన ముచ్చటదీరఁ బదేండ్లపాటు నే
బ్రదుకనుగా? పరాయులకుఁ బాల్పడఁగా? తనచేతిమీఁదుగా
వదలిన నీళ్ళతోన తెలవార్తునుగా ? కొడుకైనఁదానెగా
హృదయముపట్టకే మమత నేఁడ్చెద నా మెకిదంతపట్టెనా ?

ఏ సుకృతమ్ము పెంపున లభించెనొ ? రత్నమటుల్ తదాది నే
వేసిన వేయిరూపులయి వెల్గెను కాఁపుర మమ్మ కబ్బకున్
మూసిన ముత్యమయ్యె విధి మోఱకుఁ డాయువుమూఁడినట్టిస
న్యాసికిఁ గట్టెనైదువతనమ్ముకఁ డమ్మకుఁ దక్కు-వయ్యెఁబో?

అదిసుత బిడ్డ మమ్మన కహర్నిశ మోపిక నాలుశాస్త్రముల్
చదివిన దింతలం గని హసాదను నెంతల కోడ దన్నిటన్
జదరనిపించుకొన్న దదె చాలుఁ గుమార్త కతమ్మున న్ననున్
బదుగురు సెప్పికొందు రిది ప్రాక్తనజన్మఫలమ్ము గావలెన్.

ఎవ రది వైద్యుఁడో; నిలుతు వేల? మనోవ్యధగూరి శాంతిలే
దివలకు రండు బిడ్డకొలఁ కేఁగిన దే రని జీవనాథులన్
లివసెడి వేఁకిపుట్టి పవళించెఁ బ్రకోష్ఠముపట్టి వెజ్జొడల్
నివురుచు నిట్టనిల్చి గమనించుఁ దదీయనిదాన మింతలో.

దొడ్డ రుదురాక లఱితిపైఁ దుఱఁగలింప
ఱొమ్ము కిమ్మగు లంబకూర్చమ్ము మెఱయ
శైవసంహిత సాలువు సంది నిఱికి
మోసల న్నిల్చె శైవసన్యాసి యొకఁడు

వచ్చినారయ్య వా రన్న వార్త విన్న
చౌద రించుక కొంచి మంచమ్ముడిగ్గి
పీఁటఁ బెట్టించి లోనికిఁ బిలువఁ బంచి
అయ్య లెందుల కేతెంచి రని వచింప

శివయోగి

పరమశివునిపరీక్షఁ జేద్పడితివంచుఁ
జెప్పవింటిమి మొన మొన్న శిష్యకోటి

మనుజులకు రాకవచ్చునా? ప్రమాఁకులకును
భవపదవిభూతి నిన్నుఁ గాపాడుఁ గాక.

శివదీక్షాపరురాలు నీదుసుతకున్ సేమంబె? నీసంతత
వ్యవసాయమ్ము ఫలించునే? పరహితవ్యాపారముల్ సెల్లునే?
శివదేవాలయనిర్మిమీప దృఢమై చిత్తమ్ము ప్రేరేపదా?
అవలంబింపవుదేహముల్సతములన్నా, బుద్ధ్యదప్రాయయముల్

ఆపాతయాతనావహ
మీ పాడు శరీర మది గ్రహించినవాఁడే
రేపని మాపని చూడక
చేపడినది చేసి కృతము చింతింపఁ జెదన్.

ఆధి వ్యాధిజరామర
ణాధీనుండి త్రివర్గ మతిమోక్షేచ్ఛన్
సాధింపవలయు నలసుఁడు
బోధితుఁడై వినక రాలిపోవును తుదకున్.

ఇరుగేలఁ బ్రోవుసేసితి
తఱుఁగని ధన మీశ్వరార్పితముగాని ధనం
బఱుగదు తమతమ వారికిఁ
బెరుఁగదు కొఱవడక పిల్లపిల్లతరంబుల్.

ఏ వాఁడీశ్వరసాత్కృత
జీవధనుం డతఁడ పరమశివగణములలోఁ

గేవలుఁ డీహమున మాత్రము
జీవన్ముక్తుండు వానిఁ జెప్పఁదరమ్మా.

కాన మహేశ్వరార్పణముగా సకలమ్ము వ్యయింపు మున్నసం
తాననిమిత్త మెంతవలె? దాయలమేపిన లాభమేమి? వి
జ్ఞానధనుండ వన్నిటికిఁ జాలుదు వింతగలాఁడ వీవు చేఁ
బూనిన దెన్నఁడేని వృథవోయెనె నూటికిఁగోటికొక్కఁడున్ ?

రామిరెడ్డి

అవును మహాత్మ! నా హృదయ మట్టిద, బిడ్డకు నచ్చఁజెప్పమే
మెవరముగా మహర్నిశ మదేపనిగాఁ జెవినిల్లుగట్టితిన్
జివరకుఁ ద్రోసిరాజనియెఁ జేసెడి దేమొకొఁ మన్న దామెకున్
వివరము దెల్పఁ డింతయిన విన్నదా? సర్వము నిర్వహించెదన్.

ప్రల్లదు లూళ్ళఁ గాడుపఱుపన్ గనివట్టి తదీయదుష్కృతం
బెల్లనడంప దీక్షవహియించిన దండుక తాన వేరొకం
డొల్లదు సొమ్ము వమ్మగుట కోర్వదు కత్తులఁగాలుద్రువ్వ నా
తల్లికి రాచకార్యములు దక్క గుడుల్ గిడు లన్న గిట్టునా?

కోటలుగట్టి సైన్యములఁ గూర్పఁ దదర్థము భూమి పుత్రలున్
తాట తగుళ్లు నిల్వ ధనధాన్యము లిండులు వాఁకిళుల్ నిరా
ఘాటముగా వ్యయించుటకుఁ గంకణమూనెఁ దదాది నాకు ని
ప్పాటు ఘటిల్లె నీశ్వరునిభక్తుల కిక్కటు లుండవందురే!

పెద్దలు సెలవిచ్చెనఁ బెడ
బుద్ధులు మానంగవచ్చుఁ బురుషార్థవిధుల్
ముద్దుల బిడ్డకు సేయగ
అద్దముఁ క్రియఁ దేటపఱుపుఁ డని తలవ్రాల్పన్.

పడిపడి వచ్చి రచ్చటికిఁ బల్వురు శైవమతప్రచారకుల్
చెడుగుడులాడిన ట్లతని సేవకు లొండొరుమీఱి జాదుకం
బడుల నమర్చి రంతటఁ బ్రవక్తలు చేరువఁ గూరుచున్న డఞ
జెడగరబోడ కొంచె మెకసెక్కెముగా నగి వారి కిట్లనున్.

ప్రియశిష్యుం డితఁ డాడితప్పఁ డదిగాఁ బీడింపరా దీయెడల్
నయమైనన్ మఱునాఁడె తక్కుఁబను లెల్లన్ బూర్తిగావించు నా
లయముల్ శైవమఠంబు లొక్కఁడన నేలా? దేవకార్యార్థ మే
మయినన్ జంకఁడ దేవిచారపడు సాహాయ్యమ్ము సామాన్యమా?

ఒక్కఁ డీ శిష్యపరమాణు వుంటఁ జేసి
పుట్టగతులున్న వితఁడె చేపట్టుచున్న
బీరపుం బొత్తముల్ సంకఁ బెట్టికొంచు
ఏటి కొకఁడై గుడారమ్ము లెత్తవలయు

ముట్టి వచింతు నింతమొగమోడక తండ్రికిఁ దగ్గబిడ్డ కాఁ
బట్టికదా ? మహేశపదభక్తులు వేళకుఁ ద్రాఁగుచుండి రీ
పట్టున వీరవైష్ణవులు పట్టముగట్టిన బ్రహ్మనాయ నాఁ
కట్టిడివారు లేరిఁక జగమ్మొటు కోడయి పోయనున్నదో!

మది మది నుండుఁ డిద్ది మనమంచికె వచ్చినదన్న వారొండల్
చెదరిన జెఱ్ఱులై వెకలి చిత్తము లుత్తలమంద నయ్యెలూ!
పదకము దప్పివచ్చినది బాదమునాయఁడు చాపకూటికై
పదుగురఁ బిల్చి నైష్ఠికసభాపతులన్ వెలివేసె ధూర్తుఁడై

ఆగడ మేమిచెప్ప కడుపారఁ బసాపడమాల, మండియున్
జోగియు, జంగమున్ గలసి శుద్ధ, మశుద్ధము నాక యేకఁటన్
మూఁగిరి లోఁగి రెంగిళులు ముట్టిరి పట్టి రశౌచతీర్థముల్
సాగిన సాగకున్నఁ గులసంకరు లంకెకురారు మంకులై.

త్రిపదార్థముల విశదీకరించెడువారిఁ
గీడ్పడ మూఁడి దేఁకించినారు
పంచార్థవిధులు ప్రపంచించువారిని
ఎగ్గాడి నారసా లేసినారు
ఇష్టలింగవిచార మిదమిత్థ మనువారిఁ
దొస్సవోవగ ముక్కు డుస్సినారు
ఊర్ధ్వసృష్టివిధాన ముగ్గడించెడువారి
నుక్కుఁగత్తులఁ దాట లొలిచినారు

కొంచె మీశ్వరపక్ష మూఁకొట్టు వారిఁ
బిలిచి పెనవేసి గూబలు పిండినారు
చెప్పఁగూడదు వినగూఁడ దెప్పటికిని
వీరవైష్ణవ పరివార ఘోరకలిని.

శ్రీ సంప్రదాయదీక్షితుల రక్షించిరే
ఆ ప్రచారమ్మున కంతు లేదె ?
తిరుమంజనముపేరఁ దీర్థ మాడించిరే
చిల్లరప్రజ కెగ్గు సిగ్గు లేదె ?
చక్రాంకముద్ర లిచ్చకొలందిఁ బొడిచిరే
దేవాంతకుల మాయ దెలియరాదె ?
చలపట్టి రామానుజపతాక మెత్తిరే ?
విమతులు దమ్మెత్త పీలుపడను

శైవమతమున కూపిరి సలుపకుండ
అష్టదిగ్బంధన మొనర్చి రన్ని యెడల
నామతావేశ మాచర్య లా సపర్య
లిట్టి వనరాదు ముందుముం దెట్టులగునొ ?

పంచసంస్కారముల్ పాటించునాళ్వారు
పట్టించుకొన్నాఁడు బ్రహ్మరథము
అభిగమనాదిక మ్మగ్గించుజియ్యారు
కడిగించుకొన్నాఁడు కాళ్ళువ్రేళ్లు
తిరుమంత్రమున్ బ్రసాదించెడు సాతాని
ఒడిపికొన్నాఁడు బోలెడుధనమ్ము
కడుపుఁగక్కుఱితి కెత్తెడు మాలదాసరి
జబురుకొన్నాఁడింత చాపకూడు

అకట! సర్వంజగన్నాథ మైన దిష్టు
డదవ త్రావక మాంసాదు లారగింప
కాఱుమూఁ డయి చెడనివా రందు లేరు
విన్నవిూకేమొ? కన్న మాకున్న దఘము.

ఇన్నిటికి బ్రహ్మనాయఁడే హేతువంద్రు
పల్లెనాటికి మాఱట ప్రభువతండు
చేసినది శాసనమ్మయి చెల్లుచుండె
బలికినది బ్రహ్మవాక్యమై పరిఢవిల్లె.

అనపోతు తన సుతుం డని చాటుచున్నాఁడె!
బ్రాహ్మణ మత మారఁబట్టు ములుచ
మాల మంగలి చాకిమందె మేలమ్ముతో
బా గోగు లరయు కూరేగు తులువ
పాలెగాండ్రఁ బసందు కీలుబొమ్మ లొనర్చి
వాల్లభ్య మాశించు వట్టిబంకు
శైవవైష్ణవ భేదభావమ్ము లెసకొల్పి
జగడమ్ము లాడించు సాదుపలవ

ఇంటబైటను దనశక్తి కెదురు లేక
అన్నిటికి మున్న కాల్దువ్వుచున్నవాఁడు
అతఁడ పదికాలముల పాటు బ్రతికెనేని
చేరుపేరున మన పురు గేరితీరు.

తెలిపితి మున్న దాపయిన దేవరవారి ప్రమాణమంచుఁ బై
కులికిరి దోసిలొగ్గి రొకరొక్కరె తప్పుల నప్పళించుచున్
గొలుసులఁ ద్రిప్పి రంతఁ గనుగొట్టి గురుండను రామిరెడ్డి! అ
ప్పలుకులువింటివా! యెవరిప్రాపున మాకికఁ దెల్లవారెడున్.

దినగండంబుగఁ బిండ మెత్తు టొకబ్రాఁతే శైవధర్మమ్ము మే
మునునీతోసరి నేఁటిదాఁక మతమున్ బోషించుకొన్నారమం
దును మీవంటిమతాభిమానులు సమర్థుల్ తోడ్పడం బాటు సా
గిన దాలస్య మొనర్ప కింకఁ దగు భక్తిశ్రద్ధలన్ జూపవే?

అనిన విని రామిరెడ్డి శయ్యాతలంబు
తల్లక్రిందుగ జ్వరతీవ్రతన్ వగర్చి
దీనికిఁ బ్రతిక్రియను మీరె తెల్పుఁడన్న
శంకితులదృష్టి శివయోగివంక దిరిగె.

శివయోగి

ఇందొకఁ డున్న దీశ్వరున కెవ్వరు దప్పిన నారకంబు దా
కొందురు విన్మ మాకుఁ గడుఁ గూర్తువ యేని భవత్కుమారి మ
మ్మొందఱ నొక్కకంటఁ గనునట్టి తెఱంగు సమీక్ష సేయవే?
ముం దది చక్కఁబెట్టునెడ ముజ్జగమున్ దలక్రిందొనర్చెదన్.

కలకాలమ్ము భవత్కుటుంబమున కగ్రస్థాన మొండేమి? పూ
వులఁ బూజింతురు నీ కొమార్త కనిశంబున్ వీరసీరాజన

మ్ములు సెల్లింతురు నీదు త్యాగమహిమమ్ము న్నిత్య మగ్గింతు రీ
ఫలనాడేమి ? మిముఁన్ దిగంతములు సంభావించి పూజింపవే?

ఇంతలోఁ బసిఁ జావడి కెకరుఁ ద్రోలి
గుమ్మముం జేరి నాగమ్మ గోష్ఠిఁ దవిలి
శిరము పంకించి యెంత కె త్తిరి మహాత్మ
లెటు పరిణమించునో? చూతు నీసమస్య.

నా భావిజీవిత నాటకంబందు
శివయోగినాటెడు జీవబీజమ్ము
చిలువలు పలవలై మొలకెత్తుఁగాక
విశ్వాతిశాయియై విలసిల్లుఁగాత
వావదూకులు పాఱు వారింపుఁగూడి
పుట్టింతల న్నూఁటివోయుచున్నారు
తండ్రిమేదకుఁ దన్ని తలఁదాల్చినాఁడు
దేవునిపేర నీ దేశికోత్తములు
మానవశక్తులు మఱుఁగుపుచ్చెదరు
ఈ మచ్చుమందుతో సామాన్యజనులు
మదిదప్పి తుద కొడల్మఱచిపోయెదరు
భగవన్నిదర్శన ప్రతిపాదనలకుఁ
జుట్టఁబెట్టి మతంబు జోడించునెడలఁ
దోడ్తోడఁ బాపభీతులకు లోఁగెదరు
గొఱ్ఱెదాఁటై తమ్ముఁ గొలిచిసాఁగెదరు

భౌతికవాదులఁ బాటింపకురక
వట్టిజల్పాకులై వాదులాడెదరు
కావున మతమొక్క కట్టుకంబంబు
ఆస్తిక్య మభివృద్ధి కంగరక్షకము
ఇయ్యెరు వాఁగుల కెదురీఁదిరేని
శాంతిభద్రత లసల్ సమసిపోఁగలవు
మానవజాతులీ మతకక్షఁగూరి
రక్తపాతమ్ముతో రాజ్యమ్ము లేలుఁ
బ్రతిజాతి మతమన్నఁ బడిచచ్చెదరు
ఇందేమహాశక్తు లిమిడెనోగాని?
గరళమిచ్చిన నిల్వఁ గాళ్ళ సేవించుఁ
జెఱపట్టి కాటులొల్చిన సంతసించు
నిల్వనఁ బచ్చిగుండెలు గ్రుమ్మరించుఁ
దదితరమ్ముల కింత ధైర్యమ్ము రాదు
వారెత్తినన్ బెండువడి తపించెదరు
చేయెత్తినం గాందిశీకులయ్యెదరు
కాన మతావేశ కలితులంజేసి
ఆబాలగోపాల మన్నివర్ణముల
వీరశైవులను గావించి తీరెదను
శీలమ్మ సుతుఁడేమి చేయునో చూతు?
అతనిపాట్లెక్కఁ గుక్కలైనను బడవు.

అనుకొనుచుఁ దిన్నఁగా లోని కరిగి కేలు
మోడ్చిన "శివాయగురవేనమో" యటంచు
ఏకకంఠమ్ముగాఁ బల్కి రచటివారు
నెమ్మొగమ్ములఁ జిఱునవ్వు నివ్వటిల్ల.

బిడ్డను జూచి రెడ్డిదొర ప్రేమకుఁ బ్రేమ ఘటిల్లఁ బిల్చి పొ
న్పొడ్డిగిలం గపోణి సగ మూఁది కరమ్ములఁ జేఁది వ్రేళులన్
గడ్డము పుణుకుచున్ మొగ మెగాదిగఁ గన్గొని వెఱ్ఱిదాన! స
న్పొడ్డకుఁ జేర్ప కిక్కురణి నొప్పరికించిన లోక మేమనున్.

కానక కన్నతల్లి వొకగా నొకపిల్లవు పుర్వుపుట్టలన్
గానవు ప్రొద్దుపోవుదనుకన్ గృహమొల్లవు గుండెచీకుతో
మానని రోగమైన దిఁకమాత్రము నెగ్గుటకిష్టమైన నీ
పైని యపేక్షచేఁ బ్రదికి బైటఁబడంగల భాగ్యమబ్బునా ?

నేరిచి నేర కీవు ధరణిం దలక్రిం దొనరించువారితో
వైరముపెట్టికొంటి వటువంటి మహామహు లెత్తివచ్చినన్
జూరుల బార్లుదీరు మనక్షోభలు దేవుఁడెఱుంగు నూరకే
మారణహోమమందుఁ బడి మ్రగ్గెడు మండలభారమెందుకే.

శీలమువార లుగ్రనరసింహులు నిత్య మసహ్యమత్సర
జ్వాలలు గ్రక్కుచుందురట సైరణమాత్రము శూన్యమందులో
స్త్రీలన నిప్పుకల్ చెరిగి చేరల కెత్తెద రందు నీవసల్
గోలవు, బాల వేరయినఁ గొండల డీకొన నుత్సహింతురా ?

దొరలకు నచ్చఁజెప్పి ప్రజఁద్రోచు నమాత్యుల కేరుబుద్ధులన్
గఱపెద రెవ్వరడ్డపడఁగా దిది కాలమహాత్వ మొంటిమైఁ
ద్వరపడకమ్మ! ధూర్తులప్రవర్తన లర్థముగావు కాలమె
ట్లొరగునొ? బండ్లునోడలగునోడలుబండ్లగునొక్కొకప్పుడున్.

నెయ్యము, తియ్య మానసడు నేర్పరులైనఁ దమంతవారితోఁ
గయ్యము, వియ్యము న్నెఱపఁగావలె నీకిది గూడదైన నీ
యయ్యలు సెప్పినట్లు విను మండలులే వదిగాక పిన్నవి
ట్లయ్యును నాఁడు దానవుగదా పగవారడు గెత్తనిత్తురా?

గురుదేవా! భవదీయ దివ్యపదభక్తుం డొక్కఁడర్థించునా
మరణానంతర మీమె నేకరణి సంబాళింతురో గాని మీ
కరుణాదృష్టికిఁ గాన్కపెట్టితిని యోగక్షేమ మాలింపుఁ డీ
శ్వరుఁడున్నాఁడని పౌరుషంబు నెడ దుర్భావంబు వాటింతురా?

మీరెఱుంగని యర్థమిందేరి తెలుక
బ్రహ్మనాయఁడు ధూర్తుఁ డుపాంశువధకుఁ
దెచ్చినా బిడ్డ నెట్లుసాధించితీరు
రవరవలు డింది కాచు భారమ్ము మీది.

అన్ననాగమ్మ కక్కస మగ్గలించి
బలుమొగమ్మయి పానుపుఁ బటితళించి
గ్రుక్కద్రిప్పక పకపక పక్కటిల్లి
చీరికింగొనన ట్లు వచింపఁ దొడఁగె.

పాలసులూళులెత్తి కొనవచ్చి ప్రభుత్వము లేడ్చుచుండ నీ
బాలిసులుం బ్రధానులయి పౌరుషముల్ ప్రకటించుచుండి రీ
పాలకులుం బ్రధానులలుపాలకు లోఁగినఁ జూచి చూడ కీ
పాలితు లూరకోవలెనా! పైకొని చావలెనో? వచింపుఁడీ?

పాలన కేమిగాని తలపాగలు ముట్టిన వారి బుగ్గపు
స్త్రీలకుఁ గొంకవచ్చుఁ దెకతేరఁగ మేసి మదించు వారి కు
స్త్రీలకు జంకవచ్చుఁ బెఱచేతులు మూతులు నాకు వారి దో
స్త్రీలకు షొంకవచ్చుఁ బ్రవచించెడి వేమిఁక వారి సారముల్.

ఈ మహానీయులానను జయించున దిండలి వీరవైష్ణవ
స్వాముల పంజఁబట్టెద నెవం డదలించునా? చూతు దీనితో
భూముల గీములన్ విడిచి పోవుటా? శైవమతధ్వజప్రతి
ష్ఠామహిమావృతాఖిలదిశల్ కబళించుటా? స్పష్టమయ్యెడిన్.

చాపకూ డఁటె, వాని జన్మ మాఱడివోవ
అంక చండాల మైనది మతమ్ము
మంత్రిత్వ మఁటె, వాని మంత్ర* మూడ్చుకపోవ
కులకత్తు పాలయ్యెఁ దెలుఁగుజాతి
వీరపూజఁటె, వాని నో రట్టె పడిపోవ
మూఁకలై చెలరేఁగె లేకిగుంపు
శాసనమ్మఁటె, వాని చాతుర్య మణఁగార
వల్లకాడై పోయెఁ బల్లెనాడు

* ఇట్టి పట్టులఁ గవిత్రయేతర ప్రాచీన కవిమార్గముల ననుసరించితిని.

పౌరుషాజీవమంటె వాని పణాతవగుల
ఇట్టులెన్నాళ్లు చెలఁగి చేయింపఁగలఁడు
పాఱంబట్టెదనాతని బ్రతుకుగితుకు
మడిచిపెట్టెద నాతని మతముగితము

అనిన హాసాదసాదని ముదావహులై కరతాళముల్ జయ
ధ్వనులు సెలంగఁ బొంగి రటవారు కథ మ్రోగఁదట్టి రెడ్డిబ
బున కెగశ్వాసతోఁ గుఱకపుట్టి నరమ్ములు చేఁదుకొన్న వా
తని దురవస్థ కీశ్వరుఁడు దర్శనమీఁడనిపించె వారికిన్.

బిడ్డ పదేపదే పిలిచి పెద్దతపించిన దింక నెగ్గులే
గడ్డని రెల్లహారు గుటకల్ పడకున్నను వ్రేళ్ళు బొన్ని నో
రడ్డముచూపి పోసిరి మహాగరళ మ్మిఁక నప్పు డాతఁడున్
బడ్డయవస్థఁ దెల్పి కవిబ్రహ్మలు పాపముగట్టుకొందురా!

వడిగల్లునకుఁబోవఁ బిడిగల్లువడెనని
శివభక్తులొకవంకఁ జేరఁగిలిరి
గుండెచెర్వై గోలుగోలున విలపించి
నీఱయి యిల్లాలు నేలఁగఱచె
మాటిమాటికి బావమఱది సింగారెడ్డి
కొంప గూలినదని గోడుగుడిచె
మగరాయఁడయ్యును వగగూరి నాగమ్మ
తండ్రికై లోలోనఁ దల్లడిల్లె

గప్పుమన్నది యూరెల్ల గడపగడప
కదలివచ్చిన దప్పటి ఘట్టమందు
శిలలు నిలువునఁ గరఁగి యేడ్చినవఁటన్న
జీవులనుగూర్చి వేరుగాఁ జెప్పనేల ?

జనకుండున్ గడచన్న నాతని మనస్తాపంబు దీపంబుగాఁ
గనులం గట్టిన దైన శైవమతదీక్షాదక్షురాలై జగా
మొనగాండ్రున్ దనవైపుద్రిప్పికొని భూముల్ గోలకెత్తింపఁ జూ
చినదావిక్రమగాథలన్ రగులఁజొచ్చెన్ గ్రోధవహ్నిచ్ఛటల్.

# నా య కు రా లు

## తృతీయఖండము

పరరాజన్యుల గుండెగాలమగు మాపల్నాటి భూభాగముల్
పరిపాలించిన దుర్జయాన్వయులకెల్లన్ బ్రాభవస్థాన మీ
గురజా లోకఁ డదే నివాసముగ నల్గుత్మ్రవరుండేలునాఁ
డరు లగ్గించి రఖండ మెత్తి రనపాయంబయ్యె దాయంబులున్.

తనకుంగూర్చెడు దొడ్డనాయని భుజాదర్పమ్ము నేర్పొకఁడై
రణదాహమ్ము ఘుపన్ దదాది విపులాంధ్ర క్షోణికిన్ స్వర్గప
ట్టణమై ద్రావిడశౌర్యలక్ష్మి కొక క్రీడారంగమై పేరుప్రో
సినదన్నా ! గురజాల దాని నిపుడాక్షేపింతు రజ్ఞానులై.

నలగాముం డలుగుక్షమావరుని సంతానమ్మునన్ మేటి కా
గలవాఁడీ దురదృష్టజాతకుఁడె శిక్షాదండమున్ దాల్చె ని
స్తులుఁ డాశీలమబ్రహ్మనాయఁడు నమాత్యుండయ్యె వీరిర్వు రీ
పలనాటిన్ బలిదీసిరేమని వచింపన్ వీరి చారిత్రముల్!

పొగడినఁ బొంగిపోవు నృపపుంగవు లుందురు కొందఱందులో
మగఁ డితఁ డీమిషన్ నృపతిమానస మాఁచికొనన్ దలంచి నే
ర్పుగ శివయోగి మాగధుల బొజ్జలునింపి క్రమక్రమమ్ముగాఁ
బొగడిక లంప వారిటుల భూపతిమ్రోలఁ బఠింత్రు వేకువన్.

నానాదిగ్విజయైకకారణకృపాణా ! వీరశైవాగమ
ప్రాణత్రాణపరాయణా ! విపులసప్తాంగక్రియాసూత్రని
ర్మాణైకప్రవణా ! పరార్థవిహితప్రారంభణోజ్జృంభణా !
గాణిక్యోజ్జ్వలనృత్తగీతకలనాగాంధర్వ మాలింపవే !

రాజేంద్రా! మొగసాలచెంగట నగారామ్రోసెఁ గ్రీడావనీ
కూజత్కోకిలకాకలీధ్వనులు దిగ్వ్యూహమ్ములన్నిండెఁ ద్వ
త్పూజోత్తంభితపూర్ణకుంభయుగ ముద్యోతించె నందంద ని
ర్వ్యాజోపస్థితసౌఖశాయనికు లారంభించి రామంత్రణల్.

నలినీపత్రపుటాంతరాంబువుల స్నానమ్మాడి గంధానిల
మ్మొలసెన్ మేల్కొనుకోడెతుమ్మెద నితాంతోత్సాహియైతమ్మిరే
కులఁగొల్లైవ ప్రియురాలిపై మధువుఁ జిల్కుఁ గుల్కు శృంగారచే
ష్టల మంపెక్కఁ జగమ్ము దేఱుకొనె రాజా! లెమ్ము సజ్జుండవై.

చికిలీచేసి మెఱుంగువెట్టినపుడే శ్రీఖండరేఖాన్విత
ప్రకటోత్తాలకవాటబంధలతలన్ బ్రారంభభానుద్యుతుల్
అకలంకస్థితి నిద్రదేఱె హృదయాహ్లాదమ్ముగా భానుమూ
ర్తికి బ్రహ్మార్పణమస్తఁటంచు నిడరాదే భావపుష్పాంజలిన్

సిందూరారుణ ఫాలభాగతిలక శ్రీచెమ్మగిల్లెఁ మధు
స్యంది ప్రస్ఫురితాధరాగ్రమున నిశ్శ్వాసాగ్నిచిట్టాడె నా
నందోన్మత్తము చిత్త మీశ్వరపదన్యాసమ్ము గావింప కీ
ళ్లిందాఁక న్నిదురింత్రు స్వాప్నికజగత్సృష్టిఁ ద్రవీభూతులై.

ప్రాంగణమున భవద్దర్శనార్థ మదిగో!
భద్రగజమొండు నిలిచిరి పార్థివేంద్ర!
తన్మదాంబువులున్ భవద్దానధార
లైక్యమై వెల్లివిరిసిన వంగణమున.

నవ్యకర్పూర నీరాజనమ్ములెత్తి
సెలఁత లోలి నివాళింప నిలచినారు
నీ యశస్సౌరభములతో నివ్వటిల్లి
దివ్యకర్పూర గంధమ్ము తెలివిసేరె.

పరమశివయోగి మీ మహాప్రాభవమ్ము
ప్రతిదిన మ్మాఱునూఱుగాఁ బ్రస్తుతించు
ఆ ధ్రువాగీతికార్థమ్ము లవఘళించి
భవదఖండప్రతిష్ఠను బాదుకొలిపె.

దేవరవారింక దిగ్దేశములను
వడముడి గండలై వన్నెకెక్కెదరు
జగనొబ్బగండలై జయములొందెదరు
రాయరాహుత్తులై అంపిల్లఁగలరు.

జయ దుర్జయకళాబ్ధి సంపూర్ణ చంద్ర!
జయ భుజోపార్జితసత్కీర్తిసాంద్ర!
జయ వీరధారుణీస్వర్గ దేవేంద్ర!
జయ దానముదితార్థిజనతాబలీంద్ర!
పచ్చలపిడిబాకు బవిరివంకజము
పసిఁడిపాపోసులు పాయవట్టమ్ము
ముత్యాలపతకమ్ము మొగలిచల్లడము
రత్నకిరీటమ్ము రవలతురాయి
కైసేయుఁ డీనలగామ రాణ్మణికి
నివాళి పట్టుఁడీ నృపకులాగ్రణికి
అనుచు వైతాళికు లాచారసరణిఁ
గైవారము లొనర్చ కదలి రొక్కొకరి
పూసెజ్జపన్నున్న భూపాలుఁడంతఁ
బరతత్త్వచింతనాపరత మేల్కాంచి
సౌధాగ్రబర్హిషడ్జధ్వని కలరి
తడయక మంగళ ద్రవ్యముల్గాంచి
క్రమమింతదప్పక కాల్యముల్దీర్చి
భూతయజ్ఞమ్ము సంపూర్తిగావించి
షాడబమ్ములతోడ శర్కరాదికము
పంచభక్ష్యములతోఁ బాయసాదికము

చవులెగఁబోయఁగా శాల్యోదనమ్ము
ఘృతపయోదధిరసప్లుతిమై భుజించి
తరుణవీటీ ధగద్ధగ లుట్టిపడఁగ
వలగొని రాజబంధులు సుమాళింప
బ్రహ్మనాయనిఁ బిల్వఁబంచి మన్నించి
వినరుగా శివయోగి వృత్తాంత మీర
లనరుగా యొక్కనాఁడైన మాతోడఁ
ద ద్దివ్యదర్శనార్థ మ్మేఁగవలయు
నేరుగా దర్శించి మీ రెన్నఁడేని
శ్రీవారి సేవలు చిత్తగించితిరె?
పరమర్షి దివ్యప్రభావ మ్మదేమొ
నెల మూఁడు వానలు నిలిచి వర్షించు
ఈతిబాధలు రవంతేనిఁ జొప్పడవు
ఆ పుణ్యపూరుషు నాశీస్సులంది
మాపట రేపట మరలిరాఁగలము
వేట నెపమ్మున వెడలు టుత్తమము
ప్రకృతిచిత్రమ్ములపై భ్రాంతిదొడరె.

అన విని బ్రహ్మనాయనికి నానన మింతయి పులుకపులుకనన్
గనుగొని ధూర్తుఁ డెంత యొడికమ్ముగఁ గార్యము నెగ్గదీసెరా?
యనుకొని పైకొకింత పరిహాసముగా నలగామరాజ, మీ
రనుకొనినట్టులే పయనమయ్యెద మెవ్వర మాను కాదనన్.

జంగమవృద్ధుఁ డాబసవశంకరసిద్ధుఁడు నాగులేటి ప
ట్టెంగల వారికీశ్వరుఁ డఁటే ? మొనమొన్నన చెప్పవింటి మా
మంగళమూర్తిదర్శనము మాధవుదర్శన మంచు రంపులో
ముంగలి పెన్నిధాన మిది మోదనిదానమ కాదె భూధవా !

కావునఁ బోయి వారి సముఖంబున దేవరవారు నేరుగా
దీవెన లంది రావలయుఁ దియ్యము నెయ్యముదోఁప భూరి సం
భావనసేసి రావలయు మానిజగాదర మెంతవారికిన్
గావలెఁ గేవలుం డతఁడు గాఁడయినన్ గుఱిగల్గుట బ్రమే ?

మన్నెదొర లోలములు వట్టి మసలిరన్న
వేగువచ్చిన దచటికే నేఁగవలయు
సర్వసన్నాహ మొనరింతు జనవరేణ్య !
తప్పుఁ గ్రుంకకుమన్న రాఁదలఁచినాఁడ.

నలగాముఁడు

అవునిది ముఖ్యమిందనుక నాఁగితి కేల ? తదీయసమస్కృతం
బవగతమైన దీములుచ లప్పన మీవెలిపుట్టి యెత్తి గీ
వవు నిదికాదు నాక తలకైనకరమ్ము విధించి రమ్ము పొ
మ్మవరరికట్టినన్ బయటకీడ్తుము మాడ్తు మమాత్యశేఖరా !

ప్రభుత నెఱపఁ బ్రయత్నించు పడఁతియోర్తు
ఊళుతెగఁద్రోలి కాల్దువ్వుచున్నదంట

ఈగడ నెఱింగి గావుపట్టింపవలయుఁ
బ్రకటిలోఁ బాము నేమఱి బ్రదుకు టరిది.

పానిఁబోడఁగని చప్పున మగిడివత్తు
మాప్రయాణము వీలైన నచటి కగును
చురుకుగలవారి నాయత్తపఱుపుమన్నఁ
చిత్తమని చిన్నవోయి వేంచేసె నతఁడు.

మఱునాఁ డుదయమ్మున భూ
వరుఁడున్ ధనకనకవస్తువాహనములతోఁ
దురగాధిరూఢుఁడై దా
నరిగెన్ శివయోగి దర్శనార్థ మ్మటకున్.

# నా య క రా లు

## చతుర్థఖండము

వార్తవిని వచ్చి యరవిల్లి వారిపడఁతి
కొంతవడి మానితో గుసగుసలువోయి
ఏమినడిచినదో చంక లెగురవైచె
మూఁగియుం గొంతతడ వూర కుండియుండి

అంత ప్రయత్న మీశ్వరున కైననుదుర్ఘట మీవెటుల్ సమ
ర్థింతువా! రాచవార లలఁతిం జనువారె? త్వదిష్టమన్న న
య్యెంతి జనాంతికమ్ముగ వచించె నతండు ప్రహృష్టుఁడయ్యెఁ ద
త్ప్రాంతవిశేషముల్ నొడువఁబాలివియే ననువంటివానికిన్.

పుణ్యనాగానదీ తీరభూమిఁ జుట్టి
జిట్టగామాలపాటినారట్ట మెల్ల
నవ్యనద్వాలగంధర్వనగర మయ్యె
వర్ణనల కంద దాస్థలవైభవమ్ము.

తోరణంబుల జిల్గుతోమాలె లమరించి
రలికి ముగ్గులు దీర్చి రంగణముల
కస్తూరికామిళద్గంధసారమ్ముల
నలవడ మెత్తించి రంకణములు
చలువచప్పరము లందలి జాజికూజాలఁ
బొంగార నింపిరి పుష్పరసము
పటకుటీరములఁ జొప్పడు వితానముల క్రిం
దలవరించిరి విచిత్రాసనముల

ఒకటఁ డున్నది వేరొకటఁ డుండదంచుఁ
బెసఁగు కొందుల కటుసూడఁ గనులు లేవు
మానవేంద్రుఁడు సృష్టినిర్మాణమునకు
వ్రేలుగఱచుచు మునిపర్ణశాలఁ జొచ్చె.

అచ్చటి జనప్రవాహ మింతంతగాదు
భూపతికి నల్వలంకులఁ బొంగిపారలె
ఎవ్వ రాఁకట్టువారు లే రింతలోనఁ
గంగురని మ్రోసి నాగమ్మ కంఠ మెందొ ?

తెరదీసినట్టు లప్పుడ
తెరువిచ్చి మహాజనమ్ము తెరలఁగ దొర లు
ద్ధురగతి నడిచిరి తమతమ
పరిచితులంగూడి విడిది పట్టుల కంతక.

నలగామనృపుఁడు కాల్నడ శివయోగీంద్రు
సిద్ధాశ్రమంబును జేరనరిగి
ప్రత్యుద్గతుఁడు మౌనిపరిచయ మర్థించి
తానిడ్డచదరపై మేను సేర్చి
కడుప్రీతి నడుగుయోగక్షేమమునకెంతొ
ధారాళముగ సమాధాన మిచ్చి
భద్రమా? యింతపౌభాగ్యంబులకు సీమ
ములు సెల్లుచున్న వే ? మూడువేళ

లీశ్వరప్రతినిధుల మే మెవర మనుగఁ
దీర గొమ్ములు తిరిగిన వారికేనిఁ
దావకానుగ్రహము ముక్తిదాయకంబు
తావకాగ్రహ మశుభసంధాయకంబు.

విశ్వకళ్యాణమునకుఁ దపించువారి
పాదధూళి లభించునా ప్రాకృతులకు ?
అందు సంయమి వ్రతనిష్ఠ కగ్గమైన
వారిసందర్శన మ్మపవర్గమంద్రు.

పారలౌకికచింతనాభ్యాసకులకుఁ
బ్రాభవాదికములు ప్రతిబంధకములు
ఐన విధిలేక లోకయాత్రార్థమేము
ధర్మవిపన్నైకదండంబు దాల్చినాము.

ఉగ్రసంసార బంధమ్ము లుజ్జగించి
కందమూలాశనాసక్తిఁ గడపువారు.
మమ్ము దీవింతు రని వింద మానినాథ
ఈ ప్రజాహితహృదయ మెం దేనిఁ గలదె ?

వలసినరాజ్యముతో ని
య్యలఁతి శరీరమ్ము నైన నర్పించుటకై
నిలచితి జన్మతరింపం
గల సాధన మెఱుక పఱుపఁగదె నా కనిన౯.

శివయోగి

ఏమంటిరో ? రాజా ! జన
సామాన్య మ్మట్టులాడఁ జను నే పతికి౯
మీ మా మక్కువ కొలఁదులు
మైమఱచిన వింతకంటె మధురిమ గలదే.

తలవనితలంపుగా భవద్దర్శనంబు
లభ్యమైనది సువ్రతులము నృపాల,
ఈశ్వరాంశకు మాచిత్త మెదురు నడచి
అభిమతస్వాగతార్థమ్ము లాచరించె.

దుర్జయాన్వవాయ దుగ్ధపాథోధికి
మచ్చలేని చంద్రమామ వీవు

అమృతశీతలమ్ము లానందకందముల్
పార్థివేంద్ర నీ సుభాషితములు.

జంకు గొంకు లేని శాసనఖడ్గంబు
నీకరాగ్రమందు నిదురపోదు
కానఁ బల్లెనాటఁ గాలూన వెరగొందు
నీసమంత ధర్మ విప్లవంబు.

మనుమార్గ వర్తనంబునఁ
గనుగలిగిచరించు నృపులు గలరెందఱో? వా
రిని మఱపించితిరని మి
మ్మనయము జను లాడవిందు మందంద నృపా!

మావంటి విముక్తాత్ముల
సేవింపన్ బుద్ధిపొడమి చేరంజనువా
రేవారో దక్క త్వాదృశ
భూవల్లభు లుండు టరిది పోనిం దున్నన్.

మారణ యంత్రములై ప్రజ
దోరించుచు భోగసంగతులఁ దోఁగుచు నె
వ్వారికి వారై పరులన్
"బూరా" పడనీక తారె పొగులుదు రధిపా!

ఆకరణిఁ గాక నలువుర
సౌకర్యము లరసి సర్వజనసమ్మతిమైఁ

శాకారివైభవమ్మున
సాఁకెడు మీప్రాఁభవప్రసాదము లసదే ?

ఆ పరిచయమాధుర్యం
బీ పరిసరభూము లనుభవించిన పదిగా
మా పరిచర్యలు స్మృతుల
కేపగిది రుచించుఁ గ్రొత్తలే మావృత్తుల్.

మూఁగకోకిలమ్మ లీగున్న జింకలు
మాసపర్య కెన్నఁ డాసపడని
వందుకతన నీశ్వరారాధనము దక్క
నితర సేవ లెఱుఁగ మింతదనుక.

పండి యెండిరాలు ఫలపత్రజాతులు
భుక్తి కాత్మజపము ముక్తి కగును
చలము, బలము: గూరు పద్రసీగ్రాసంబు
మాయవైష్ణవమ్మ చాయఁబోము

విడువ ముడువరాని విశ్వకుటుంబమ్మ
పెట్టిపోయలేని చుట్టఱికము
చాలుమూలలేని సన్యాసిసంసార
మెట్టు లాతిథేయ మిచ్చితనువు

అందుకతనఁ గప్ప మాఱవపాలైన
న్యాయము మేని విడిచినార లిప్పు

డాశ్రమములపట్ల నతిశ్రద్ధధానులై
ఇంతకూర్చునేడనిఁ కేమి వలయు

అన్నతోడ హృదయ మానంద మృదులమై
కేలుమోడ్చి ధరణిపాలుఁ డనియెఁ
బ్రకటఁ బొంచు లుండి పలనాటి సురతాణి
చెవులు దోరగించి చిత్తగింప

వనవాసవ్రత మెంతవారికో గదే! వాఁ డీశ్వరుండైనఁ గి
మ్మనరా దన్నఁ జెడున్ మహేశ్వరపదధ్యానామృతాస్వాదన
మ్మునఁగాలమ్ముఁ గ్రమింతు రంతమునకున్ మోక్షాధికారమ్ముగై
కొని కైలాస మలంకరింతు రివె మీకున్మాకువ్యత్యాసముల్

ఈనాగానది తీరపుణ్యవనిలో నీ యాశ్రమక్షోణిలో
బ్రమానై పుట్టిన మోక్ష మబ్బునని సంభావింతు రిచ్చోటనే
ధ్యానానందనిమగ్నులై వడయు నిర్వాణంబు సామాన్యమా?
మౌనీంద్రా! యతిరాజు లీ ప్రకృతిసామ్రాజ్యాధినేతల్ కదా!

తెలవాఱన్ మలయానిల మ్మొలసి ప్రీతిం గొల్ప లేమావి కొ
మ్మలపైఁ గోయిలగంటప్రాయ నుదయన్మార్తాండబింబద్యుతుల్
పొలయన్ శిష్యులతోడఁ గూడి నిరతమ్ము న్నీరు నాగాపగా
జలముం గ్రుంకుస్థలప్రశంసల భవిష్యల్లోక మూఁకొట్టదే?

నలగాముం డిటువచ్చి ముగ్ధుఁడయి సన్మానించి సేవించు వా
ర్తలు పల్నాటిచరిత్రలో నొకమహాధ్యాయమ్ము గా కుండునే?

తెలుఁగుం గాథలు ద్రవ్యవారి కివి ప్రత్యేకప్రమాణమ్ములై
వెలయున్పూర్వమహీపతుల్ యతులిటుల్ ప్రేమల్ ప్రదర్శింపరే

శ్రీవా రింత వచింపనేల! భవదాశీర్వాద మాతిథ్యమై
భావమ్ము న్దనియించు నిందాలకుఁగా బ్రహ్మాండమున్ జేయనే
లా వేదత్రయ మూర్తు లిట్టి లోక శిష్యప్రాయు నగ్గించి సం
భావింపందగ దెంతగొల్చిన నృపుల్ ప్రాగ్భారపాథోనిధుల్

మీ మనఃపరికల్పితమ్మా మఠేమి?
స్వర్గపట్టణమైన దాశ్రమపదమ్ము
ప్రభువులకు దుర్లభంబైన విభవ మిద్ది
కాదఁ టన్న మయబ్రహ్మకల్పితమ్మె.

శివయోగి

మాదేమున్నది రాజా!
సాదుల మీవిభవమునకుఁ జాలుదుమే? మీ
రై దయ సేయుదు రనియొక
పైదలి యిప్పగిది నేరుపా టొనరించెన్

వినియుం డెదరీ ప్రాంత
మ్మునకున్ బులివంటి దులిపిమూఁకల కాపే
రనినన్ సింహస్వప్నము
కనుక న్నేమిట్లు బ్రతుకఁ గలిగితి మిచటన్

మీపై నెయ్యము, తియ్యము
దోఁపఁగ బ్రభుభక్తి పలుగతుల వెలలించున్
భూపాలకార్య ఖడ్గ
వ్యాపారమ్మునకుఁ దగ్గవలఁతి సుమన్నన్

నలగామఁ డౌడుగఱచుచుఁ
దెలికన్నుల మందహాసదీధితు లొలుకన్
దిలకించుచు స్వామీ! యు
ప్పొలఁతుక మఱియెందు కిందుఁ బొడసూప దనన్

విన్నదా! రెడ్డిరాణి పృథివీపతి కన్నుమొఱంగి యోగిచే
నన్నరయొనర్చె నామె భయసంభ్రమముల్ వెనుకాడనొద్దికల్
మున్నగనేఁగుదెంచినృపుబ్రోలఁగరమ్ములుమోడ్చునిల్చెభూ
భృన్నయనాగ్రముల్ వెలువరించిన వస్ఫుటమందహాసముల్

తెలివాలుంగనులార్చుచాబిడ నమస్తేయన్న రాజేంద్రుఁడో
దలపంకించి మునీంద్రుదిక్కు మొగమై తన్నిత్యకృత్యమ్ములన్
కులగోత్రాదు లెఱింగిపల్కు నతివా! క్రొత్తైనఁ బ్రాఁతైనఁ గాం
తల మర్యాదలె వేరు పూరుషులచేఁతల్ వేరు యోజింపగన్

ఊరుంబేరన లేని పల్లెపడఁతుల్ హోదాలు కాంక్షింపరీ
తీరెందుం బొడఁగాన మింతదనుకన్ స్త్రీరత్నమిందున్నదన్
పేరే మాచెవిసోఁక దబ్బురము కొల్పెన్ నీచరిత్రమ్ములో
కారాధ్య మ్మనవద్యమై నెగడు నియ్యాశావకాశమ్ములన్

మము మెప్పించితి వెద్దిగోరుకొనినన్ మారాడ కర్పింతు మో
ప్రమదా, నిస్తులవస్తువాహనములో? ప్రాసాదరాజమ్ములో?
ప్రముఖోద్యోగములో పసిండినిధులో గ్రామమ్ములో భూములో
రమణుల్ మాత్రము రచ్చకెక్కఁదగరా? రాణింపరాజాజ్ఞలై?

అన నాగాంబ వినీతయై పలుకు దేవా! మీదయాదృష్టి చా
లును మీ ప్రేమరసప్రసంగము లెచాలున్ ద్వాదృశుల్ గోరుకొ
మ్మనినన్ మాదృశులూరకున్న భవదాజ్ఞాతిక్రమంబంచు న
న్ననరే కావున దోసిలొగ్గెద విపర్యస్తమ్ము గాదన్నచో

గురుదేవులె తెల్పిరి మీ
చరణార్చకురాలి పూర్వచరిత మ్మగుటన్
గరుణించితి రీజన్మకు
నెరవేరని కోర్కె తండ్రి నెలకొల్పి చనెన్

నాపుటుక కెత్తి పోయిన
కాఁపుర మసులుసులు దెలిసి కలిగితి మదిగాఁ
గాఁపులలోన పరార్థ
ప్రాపకుఁడగు రామిరెడ్డి ప్రాభవ మెచ్చెన్.

తన్ను నన్నుఁ జూచి దైవమ్ము కనుగుట్ట
దుఃఖజలధిఁ దొప్పదోఁగినాము
పౌరుషమ్ము దక్క ఫలమొండు లేదని
గుండె రాయి జేసికొంటి మథిప!

అది సుతలోకమెఱింగితి
బదవలు దలఁగితిని యిట్టి ప్రాజ్ఞులతోడన్
జదివితి నీశ్వరసాక్షిగ
మెదలితినీలోన తండ్రి మృతి ప్రాపించెన్.

బ్రదికినదినములలో మీ
హృదయము కరఁగించి కూతుఁ రీపలనాటన్
దుదకొక్క గడియ తావక
పదవినధిష్ఠింపఁ జూడవలె ననుచుండన్.

ముదిమది దప్పిన మేళము
పదవీవ్యామోహ మయ్యె పాడినదెల్లన్
అదియిదియన కూఁకొట్టుదు
నెదియైనన్ జనకునాజ్ఞ కెన్నఁడు దప్పన్.

మొన్న మొన్న మృత్యుముఖమందు నుండియు
యోగిచంద్రు ప్రోల నుగ్గడించె
సిగ్గుబొగ్గుగాను శ్రీవారిచెంగటఁ
జెప్పవలసె నిట్టి చిన్ని కోర్కి.

అనినన్వాల్వాలఁ బాఱె రాజు మొగమయ్యర్థంబు భావించి దిం
పిన దింకొక్క ప్రసంగమందుఁ దనగంపెండాస కుం పౌనఃటం
చనుమానించుచు సంజ్ఞచేసినఁ దదీయాజ్ఞానిబద్ధుల్ పరా
కనుచే తెంచి ప్రదర్శనావసరమమ్మా! చూడరారేమనన్.

అవును మరచితి మంచు నాయమమునీంద్రు
హెచ్చరిక సేసె నతఁడల్ల నెచ్చరించె
రాజనంతటఁ దత్ప్రదర్శనముచూడఁ
జనిరి మూవురు తగుపరిజనముతోడ.

వచ్చెడివారికై విఱుగఁబడ్డవి గుంపులు చూచుమాత్ర నే
ముచ్చట పడ్డవంత మునుముందుఁ జొరంబడి వేత్రహస్తులన్
ముచ్చెమటల్పడన్ దెరల మొత్త బడల్పడి కుప్పతెప్పలై
అచ్చనగండ్ల పోలికఁ నటులై యిటులై కుదుటంబడన్ ప్రజన్

అలవఁద్రోకఁనీయ కదలించివిదళించి
కెరలిచీట్ల నిచ్చి గెంటినారు
జలధిగర్భమట్లు కలగుండు వడివడి
అద్దుపద్దులేని సద్దుమణఁగె.

యతిప్రక్కగా మహీపతి దిక్కుగా వెనక
కొదిగిచదికిలఁ గూరుచున్న యువిద
రైతు వస్తు ప్రదర్శనమునఁ బాల్గొని
కొనరి తత్తద్వస్తు గుణము లెన్న
భూపాలుఁడలఁతినవ్వున జెప్పలల్లార్పఁ
బనివాండ్రు గుమ్మయి రనుపదమున
గరిడిసాధనల మెచ్చిరి రైతు జెట్టీల
చాల్పట్టునేర్పున సంతసిలిరి

మేలిజాతి పశుల మెచ్చి రావన్నెకు
ముక్కుమీఁద ప్రేలు మోపికొనిరి
మలుగుచట్ట మరసి తలకట్టు దిలకించి
మచ్చమదుపు చూచి జెచ్చవడిరి.

ఇంతలో నెడ్లతుగిడీల నేర్పరించి
పట్లుపట్టించి రాబంటు పగ్గలేమొ ?
కొట్టి కోలాహాల మొనర్చి గోడుగుడిపి
రట్టుకట్టునఁ బొడిచినట్లయ్యెఁ బసికి.

మలిచిన నందులే మెడలు మాట్చిన నట్టులమాటకేమి! ప
ల్వులు చిఱుతల్ లుఃకాలుకలు, పోలు, పరమ్మిరుసుల్ బదాబదల్
గలిబిలియైన దొక్క క్షణకాలములోఁ బిశలాటకమ్ములై
ఎలపయిఁ గాడి మోపి కవియించిన యెడ్లుపెడంకెవేయఁగన్.

కొలుకుల నిప్పుకల్ గురియ కోడెలఁబట్టఁబదుంద్రు వాజిరా
మలపవి కాలుద్రువ్వ యజమానులు నుచ్చరకొట్టి తెచ్చిర
య్యలబల మాఁగి కోపులకునై దిగియం బెరరేఁగి కన్నుమి
న్నెలియక మోఁకఱించి పిరుదీయ కమాంత మొదల్ సడల్చినన్.

బండలు బెండ్లవోలె నెలపైఁ బరువెత్తిన బండ్లు గుండ్లులే
బొండములం బలెన్ దొరలిపోయిన వాయెడ నొక్కపెట్ట బ్ర
హ్మాండ కటాహముం బగులునట్లు జయధ్వను లుల్లసిల్లె నా
తుండము లేని యేనుఁగుల త్రొక్కిడి గ్రక్కదలెన్ బరుల్ గిరుల్.

గువ్వ కోల్గొని గుంపులు కోపుటుడ్ల
హెచ్చులొచ్చులఁ గూర్చి వాక్రుచ్చుచుండ
మువల భీముండు శ్రీవారి ముందు నడపి
కంచుకంబాలగద్దె నెక్కించినాఁడు.

ప్రజలు మల్లెవడిన పల్లేరువడువునఁ
గలయ బెరసి దువ్వగాళ్లఁ బెనఁగి
అధిపుఁ డాడుమాట కంగిటి బెల్లమై
కూరుచుండి రొదిగి గుటక లిడుచు.

అధిపుఁ డైనవారి కర్థాసనం బిచ్చి
మాట మంతిఁ గొంతమందిఁ దేర్చి
నాగసానిసేవ, యోగి పల్లాయన
ముగ్గడించె సభ్యు లుల్లసిల్ల.

ఆవల నాగమ్మ యభ్యర్థనమున
నగుమొగ మ్మెగయించి నలగామనృపుఁడు
విజయ మొందినవారి పేర్వారఁ బిలిచి
బహుమతు లిచ్చి యిప్పగిది వాక్రుచ్చె
ఉత్సాహవంతురా లుపపన్నురాలు
అనుపమ ప్రభుభక్తి కగు ధీరురాలు
మా కొనర్చిన రాజమర్యాద లేమి!
స్త్రీ కుండఁదగిన విశేషమ్మ లేమి!

కార్యదక్షతకైన కౌశలమ్మేమి!
మాడుమూర్తులునిండ మూర్తీభవించె
ఈ జమ్మిరేవుల కీ గడ్డములకు
ఈ ముఖాసాదార్ల కీ పాళెములకు
ఇఁకముందు ముందు నాయకురాలనంగఁ
జెలఁగి చేయింపఁ గాంక్షింతు మింతేల!
అవసరమ్మనక నిరాతంకముగను
పాల్గొనవచ్చు మా ప్రాభవాదులను
ముకాలి ముదుసలి ముద్దు సెల్లింపఁ
బలనాటి నొకగడెపాలింపఁ గోరె
గడియ కాదొక యేడుగడియ లేలింతు
ఇంతులం దీతెలి వెందునుంగలదె?
అబలకోరిన కోర్కె కౌను కాదనక
పరువుమాలిననాఁడు ప్రాభవమ్మేల!
ఈ సభాముఖమునం దీరాజముద్ర
ఈశ్వరసాక్షిగా నిత్తుఁ గైకొమ్ము
అని రాజు ముద్రిక నవలికందింపఁ
దనకైనవారి యాననము లింతయ్యెఁ
జప్పటల్ చఱచి రచ్చటి చీలికాంద్రు
గుబగుబమని సభ గుబ్బతిల్లియును
వింజమాకిడినట్లు విస్తుపోయినది.

నాగమ్మ యింతకెంతకుఁ
గాఁగలదో! లేచిలేవకయె భూపాలా!
స్త్రీగౌరవమ్ము నిల్పిన
త్యాగమ్మున కివె నమశ్శతము లర్పింతున్.

ఏనుఁగుపాడిగదే మా
భూనాథుల కొలువు? పూర్వపుణ్యము కతనన్
బ్రాణులలో మానవులై
రాణింపన్ సత్య మవసర మ్మొందైనన్.

పడఁతి కెపుడు బుద్ధి పెడతలఁ బట్టుట
వాస్తవంబు దీని వలవదన్నఁ
జపలలన్నమాట సార్థకమై తిరు
అడిగినప్పు డిత్తు రుడుగు డిపుడు.

మీమాచనవులు మనవులు
మోమోడక నాల్గుఁ గాలముల పాటున్నన్
ఏమూలఁ బాఱు నీర
మ్మామూలన కట్టువడు నఁటున్నదా లేదో!

మన్నీలుల్లసమాడి రుక్కివులు కొంపల్గుత్తలై పల్కిరా
పిన్నల్ పెద్ద లెటాడిరో తెలియ దాపేరోలగమ్మాపి రం
తన్నల్పెకిదిశల్ గుడారములఁ జంద్ర జ్యోతులెత్తించి రిం
దెన్నాళ్లుండెనొ? భూధవుం డెఱుఁగ రాదీ యింద్రభోగమ్ములన్

# నాయకురాలు

## పంచమఖండము

కాలునిజోడుకోడె మనకన్నమహా సౌకనాఁడు వీరభ
ద్రాలయవీథిమధ్య నడుగామడగాఁ బయనించుచుండి మా
శీలము పెద్దనాయనికిఁ జెప్పినలాభము లేదు చీలిక
య్యాలకుఁ గాలుద్రువ్వు నిదియానది గాదనినన్ గణింపఁడే.

ఎఱిఁగి యెఱింగి నాయఁడట కెందులకంపెనో? వెళ్లికప్పముల్
పెరవునఁ గొంటలెస్స పృథివీపతిచిత్తము కాచగోళమై
మెఱయుట నేఁడకాదుశ్రుతిమించిసుమారయిదాఱుమాసముల్
జరిగిన వంతకంతకు విషమ్మొలికించిరి స్నేహపాత్రలన్.

ఎన్నటికాఱునో? తెలియదిచ్చట కేఁగిన విప్లవాగ్ని లీ
కన్నమదా సౌకండెమున కక్షకుఁ గారణమన్నదంట రా
జన్నిటికైనవాఁడు ప్రజలన్న నమాయికు లెట్టు లంచు లం
కన్నగృహంబుసొచ్చి తనకైన సపర్యల నంది యిట్లనున్.

అవునవు నిప్పు డట్టుడికినట్లుడికెం బలనాడు వెఱ్ఱివాఁ
డవుగదె? రాచవారి రగడల్ వినకుంటివె? మంత్రిపట్టమా
యువిదకుఁగట్టునంటమనముందు మొపోదుమొ బ్రహ్మనాయఁడే
చివరకు నిర్ణయింపవలె సిగ్గుగలా డెవఁ డిందు నెగ్గెదున్

లంకన్న

కట్టినఁ గట్టనిమ్ము కలకాలమిదే మనభుక్తమేమి? సా
మ్రాట్టులు వారు సర్వమొక మానినికేమిటి? మంటఁబెట్ట ని
మ్మెట్టయినన్ సరే? ప్రభుత నేడ్చెడు నాపకు మంచిచెడ్డలున్
బట్టవు వారువారి పరివారము దేరినఁజాలుఁ బుణ్యుఁడా!

స్వాములతోఁ బాములతో
ఏమాత్రము చెలిమిచేసిరే నెల్లెడలన్
భూములు గీములె కాదోడ
లోముకొన నెమ్మెలఁగవలసియుండు నెన్నైనన్.

ఈ మంత్రిత్వమె కావలె
నా మనబ్రహ్మయ్య కూళు లడిగికొనినచో
ఆమాత్రమైనఁ బుట్టదె?
కామినితో లేనిపోని కయ్యా మదేలా?

ఆ వీరవైష్ణవమ్మ
దోవలసినవారి కింత యుపదేశవిధుల్

శావింపరాదె ? శైవము
శైవమ్మని మండిపడిన సార్థకమున్నె ?

పరిపాలన మని పేరును
మరియాదఁదొలంగి తుదకు మతయుద్ధముతో
నలుకుడు లారంభింతురు
నరపతు లఁట మంత్రులంట నగుబాటిది యే ?

ఏమతమైనను దేవుని
సామీప్యమ్మనకుఁ దేరఁజాలు నదేదో
మేమింతవఱ కెఱుంగము
మామూలగు కట్టుబాట్లె మత మన వింద్రుఁ.

ఇంత కడుగవచ్చి యేమఱినాఁడను
బాదనాయఁడెంత వాఁదు దెచ్చెఁ
బంటగడిపొలాల బండల నీడ్పించి
పరగణాలఁ గాడుపఱిచె నంట?

కన్నమనీఁడు

ఇదికదోయి! కొంపకెసరుపెట్టిన దిప్పు
డీమె కిన్నికాళ్లు లెట్లువచ్చు
నూఱిపోయుచున్న దేరోజు కారోజు
లజ్జదొఱఁగి నృపతిపజ్జఁ జేరి

బ్రహ్మనాయని పనుపున వచ్చునాప
కప్పనము లీయవలదని యానపెట్టి
ఎకుమేకైన బాదన్న యాకళించి
ఇంతకుందెచ్చి విడిచినాఁ డేమిచెప్ప

తొలుదొల్త నారిప్రేవులు దోడితెమ్మని
అధిపుఁడే నాయని కానతిచ్చె
అతఁడన్న పెద్దన్న నామతించి సమస్త
మిదమిత్థమని నిర్ణయించి పంచె
నాలిముచ్చా ధూర్తురాలికతమ్మున
నిరు తెఱుంగులవారి కింత పుట్టె
అది సాకుగా బొమ్మలాడింపఁ దలకొన్న
దిఁకముందు ముందెంత కెత్తఁగలదో ?
పట్టపగ్గాలు లేకుండఁ బల్లెనాటఁ
బంతకాఁడన్ననిరు కేలఁ బంతులాడి
ముదిరి కోడయి కూయుచున్నది జగాన
సారె కాకతీరుగా నాగసానిపేరు.

గురుతుచ్చి పోనంప కోలనేసినవారి
పేరు పేరునకు నూఱాలు లిచ్చె
మడమద్రిప్పక జెట్టి నొడిచిన మల్లుర
నగ్గించి డాకాలి కందెవేసె

పొట్టకై తెగిపాడు బట్టుబైనీంద్రకు
విచ్చలవిడి సొమ్ము వెచ్చపెట్టె
విశ్వాసమునఁ గొల్చువేగులవాండ్రకు
గోతాలవరహాలు గ్రుమ్మరించె.
మడులుమాన్యము లర్పించి మన్నదొరల
గాఁటఁగొట్టిన దీపలనాటిబిడ్డ
ఘటకులకు నీమె వలదన్న గుటక దిగదు
పచ్చిబూతయ్యె మనరాజు బ్రదుకు తుదకు.

కట్టించినది కోటగడ్డల కెదురుగా
జంగమవృద్ధుల సత్రశాల
త్రవ్వించినది జలాధార ధూర్వహముగాఁ
ద్రుల్లింతలంబోవు దోపచెఱువు
అలవరించినది రాజాంతఃపురము ముందు
మేలైన గాజుకంబాల మేడ
సృష్టించినది వేర శివభక్తులకుఁగాను
సావరమ్మున యందు శైవవీథి
ఇండ్లు వాఁకిళు లూర కర్పించు కొలఁదిఁ
బెదవిగదపక పిడికిలి పిండుకొలఁదిఁ
బరువుమాలిన ప్రజలకుఁ బండ్లుపులిసి
ఆమెమాటన్నఁ బడిచత్తు రనుదినమ్ము

**లంకన్న**

ఇఁకఁగుసుకేల? నిక్కముగ నిప్పటి కీపలనాటి సీమకే
మకుటము: లేనిరాజు మన మంతనముల్ కొనసాగ వామెదే
శకమని చెప్పవచ్చు బహుజన్మ తపఃఫలమేమొ గాని యీ
మొకమునకట్టి నేర్పొకరిమూలమునన్ లభియించెనందువా ?

**కన్నమ**

నేరుపా? గీరుపో? తెలియనేరఁ దదాజ్ఞకు దాసులైరి స
రాక్కరులు, కోఁచలైరి గడెకారులు, నమ్ముడుబొమ్మలైరి హం
వీరులు దాను లేని పృథివీపతి లేఁ డిక నూఱుసెప్పఁ డా
పేరనఁ బల్లెనాటఁ బసిబిడ్డయుఁ బాల్గుడువన్ భయంపడున్

వినవో? నాఁటి రహస్యనిర్ణయము లుర్వీభర్త ప్రత్యేక శి
క్షణకై సైన్యము లప్పగించె నఁట సత్కారమ్ములన్నిన్ని గా
వని రావైభవమేమిసెప్ప నృపుసేవార్థమ్ము దోతెంచు న
వ్వనితా వైఖరిఁ జూచితీరవలె నబ్బా! లోక వైకుంఠమే?

మనరాజన్యున కట్టి ఠీవిగలదే? మన్నీలు మర్యాదకై
చనుదేరన్ బడవాండ్రు మున్నడువఁ బజ్జన్ దివ్వటీల్పట్టఁ జు
ట్టును పీచోపులిడన్ నుతుల్ చెలఁగ బోటుల్ గొల్వ దంతావళం
బున నూరేఁగుచు రాజపీథిఁ బడిపోవున్ ఠీవిదై వాఱఁగన్.

కడకు నాయని పొలకువ కంటఁబడినఁ
గెరలి బయలూడ గర్జించి కేకరించుఁ

బంతమునకైన నాయని భవనవీథి
గుబ్బటిల మూలమూలలఁ గొల్వుదీర్చుఁ
జిత్రమిం దొకండు శివయోగి గురుఁడఁటే
ముందు నడచు నతని యందలమ్ము
బలఁగ మేఁగుదేర నలగాముఁ డెదురేఁగి
చేయివట్టి గద్దెఁ జేర్చునంట.

బ్రహ్మనాయ డిందుఁ బాల్గొనఁ డెన్నండు
దానఁ జేసి పిలుపు తలఁపు లేదు
ఊరకుండ నేర డుద్యోగధర్మానఁ
బోయివచ్చుచుండు న్యాయసభకు.

లంకన్న

నలగాముం డిది బుద్ధిపూర్వకముగానా ? లేక నాగమ్మ మొ
క్కులకున్లొంగెనా ? బుద్ధి గడ్డిదిన లోకుల్ సైతురా ? వానిపూ
ర్వుల వృత్తాంతము లెట్టివో ? తెలియఁడా ? పోనిమ్ము బ్రహ్మయ్య కే
తలవంపా ? పదిలోనిదొకఁడను తాత్పర్యంబెముమ్మాటికిన్

కొంతకాలముకడచన్న సంతులేక
అల్లురా జంగలార్చిన నడ్డుసెప్పు
కన్న పెద్దన్నఁ బెంపక మంపినార
లమ్మహార్థము గుర్తింపఁ డతనిసుతుఁడు

వాని దుర్భర ప్రాణావసానవేళఁ
బారమెఱుఁగని తన ప్రభుభ క్తికతన
దొడ్డనాయఁడు నసువులఁ దొఱఁగెనందు
రంటు కీలక మితని కె ట్లర్థమగును?

అనుగుభూపతి దొడ్డనాయండుఁగూడి
బిడ్డలకుఁ దమపదవు లర్పించునాఁడు
ఇరుగడల నెన్ని బాస లాడించినారు
పరువుచెడి నేఁటి కీక్రియ భ్రష్టులైరి.

పోని! వారివేని మానవతత్వముల్
మాటమంతి దక్కి మనఁగలారె?
ప్రభువులైనవారి బాధ్యతగు ర్తింప
కాడిపోసికొందు రథములట్లు.

తప్పులున్నములుచ దండింపఁ గాదన
రాఁడు దని సహించు టర్హమగునె?
తలఁకు నృపతి ధర్మ దండంబు గాల్పనా?
ఎడప కవకరమున కీడ్వవలయు.

## కన్నమ

ఏమిసహింపఁడోయి! వచియించెదఁ గల్గినమాట గట్టిగా
స్వామికిఁబ్రీతి పుట్టఁ బరిచర్య లొనర్చుఁ దదీయప్రాభవ

క్షేమము లుగ్గడించుఁ దనచిత్త మెఱింగి చరించు బాదప
స్వాముల నీసడించు నిటువంటి పడంతిని జూడ మే మెడన్

బలమద రేఖ చొప్పడు భద్రగజసప్త
కమ్ము భూపతి కంకితమ్మొనర్చె
పడివాగె కమరుసల్వాది గుఱ్ఱపుదడంబు
లధిపతి సైన్యంబునందుఁ జేర్చె
ప్రతిపక్షమొక్క డెబ్బదిమణుంగుల సేయి
కొలిపించి శుద్ధాంతములకుఁబంచు
సకలాంధ్రమండల జైత్రయాత్రార్థమై
ధనరాసు లిరుకేల ధారవోసె

ఇంట బైటఁ దనకు నిన్నిరూపమ్ముల
నడుముగట్టి నిలుచు నాగసాని
నెట్లు మందలించు నెదురుసెప్పి జయించు
మచ్చుగదిరె నిన్ని మాటలేల ?

లంకన్న

నాగసానికి మన బ్రహ్మనాయనికిని
ఎడతెగని వైర మెందుల కేరుపడియెఁ
గొమర లొకఁడన్న నొకరుండు గుజ్జులనుమఁ
బాడిచికొనఁ జూతు రిర్వురి దడవిగోడు.

## కన్నమ

నారసమ్ములఁ జెవులేసి నా రఁటయ్యా ?
నాటక మ్మాడెదవు సంగనాచివోలెఁ
బదిపదాఱేండ్లనాఁటి దీ భారతమ్మ
ప్రజలు ఓఖుల రోకళ్ళఁ బాడ వినవె ?

తండ్రి నొప్పించి తాన పెత్తనము పూని
ఈఁగ కిలి పామునకు బలియొయుగఁ కాంమె
పాఱుకాడిన దాచేయి పరుసవేది
పట్టినది పైఁడిముద్దయై పరిఢవిల్లె.

వ్యవసాయము వ్యాపారము
సవరించిన చుట్టుపట్ల సంసారముల
స్నుపుడై యాధమర్ణములై
చివరకు నాగమ్మ చేతఁ జిక్కెన్ స్రుక్కెన్.

జిట్టగామాలపాటి కా చుట్టుపట్ల
కలవిదప్పిన రాణియైనది కుమార !
ఆపె మందలు మలయు చిట్టడవులందుఁ
బుల్ల రసువానితల నేల డొల్లనేసె.

ఉత్తమర్ణరాలు చిత్తగించినఁగాని
సిస్తు పస్తు తోలిఁ జెల్లవయ్యె

బ్రహ్మనాయఁ డిద్ది పసిపట్టి కసివట్టి
బీతుగదుర దండనీతి నెఱపె.

సముతుకట్టి నాగసాని పెనంగినఁ
గూడదంచు నాయఁ డాడిపోసె
పాతుఁ బంచి భేరసారమ్ము లాడింపఁ
బట్టుపట్టి కెట్టిపన్ను లోడిసె.

కోయమూఁక లఱిపికొంటకై పలుమాఱు
లధిపుసభ్యనుజ్ఞ కరుగుదేర
గమిడి ద్రాక్షనీక గద్దించి గెంటించె
గండగొండి పన్నుగడ లెఱింగి

పరమశైవులన్నఁ బడిచచ్చు నాబిడ
వీరవైష్ణవులను విసువఁ డితఁడు
శైవవైష్ణవప్రచార ధూర్వహు లిట్టు
లుడికిపోవుచుండి రొక్కరొకరె.

నాఁడు రాజుమ్రోల నాయఁ డాడిన దాట
పాడినట్టిదెల్లఁ బాటయయ్యెఁ
బడఁతి కపుసు మాయపాచికల్ పాఱక
మేలుకొన్న దిపుడు వీలుకొలఁది.

ఆ గుఱ్ఱువెట్టుకొని బా
గోగులు గణియింప కితవు లూఁకొట్టకనేఁ

ఞాగమునకుఁ దలపడినది
పోఁగాలమ్మునకు నిట్టి బుద్ధులె పుట్టున్.

లంకన్న

అతఁడేల జాగుసేయునో ?
చిత్తుకంబాడిపింప కట్లుసెప్పన్న? నేనీ
పితలాటక మ్మెఱుంగను
పతికించిన వింతకామె పన్నాగమ్ముల్.

కక్కులకళ్లైమె కాదది
ప్రక్కన బల్లెంబుమనకు బ్రహ్మయ్యకు నిం
కెక్కడఁ జిక్కిన నక్కడఁ
గిక్కురుమనకుండఁ బొడిచి కీళ్లైడలించున్.

దుర్జనులున్న ప్రదేశము
వర్జించుట మంచి దెంత వారలకైనన్
దుర్జాతి పొత్తు తరతర
మార్జించిన మంచిచెడ్డలార్చున్ బేర్చున్.

నలగామనృపాలకుఁ డా
చెలికాలికి బలవమైనఁ జినమలిదేవా
దులు బ్రహ్మనాయని బూ
ఫులఁ బూజించెదరు కుటిలబుద్ధు లహంగన్.

కన్నమ

అదివిందుము నిప్పునకే
చెదలంటిన నితరమింకఁ జెప్పెడిదున్నే?
పదపద నాయఁడు మనకీ
పొదచెప్పాట కింట నెదురుచూచుచు నుండున్.

గోడకుఁ జెవ్వులుండవుగా?
ఆఁకుదియానుకొంటివో? యహర్నిశముల్ బూ
జాడలుదీయుచు నాడులు
దోషు న్నీ వేమెఱుంగుదువు లంకన్నా!

పులివెన్న ఊాతిజున్నును
మొలవసి చెట్ట్రాఘుఁ దేరమొనగత్తె సుమా!
నిలువెల్లఁ గన్ను లున్నవి
నలగామనృపాలుఁ డుత్త నాపగదన్నా!

అని లంకన్నకరమ్ముల్వట్టిచనువాఁ డల్లంతటన్ బాదనా
యని వీక్షించి వినమ్రుఁడై సరగ డాయంబోయి మా పెద్దనా
యనగా రేమిట వచ్చినారనిన బిడ్డా! బాలమద్దేవ ర
క్షణకై నన్నిటు పంచె నాయఁడని ప్రస్తావించె నింపాదిగన్.

పనివడి దేవిడీకి నిరుపార్శ్వముల న్నడయాడు పాదచా
రిణుల నదల్చి వారు వివరించిన దూఁకొని మూవు రావలన్
జని రటఁ బొంచి వారల ప్రసంగముల న్విను గూఢచారులున్
వెనుకొని రంత గుబ్బతిలె వీథి తదీయకథానకమ్ములన్.

# నాయకురాలు

## షష్ఠఖండము

విజ్జలదేవి కల్లుపృథివీపతి గట్టిన సౌధపార్శ్వలా
మజ్జకకాయమానములమధ్య నిదాఘవిదాహమూఱఁ బూ
సెజ్జఁ బరున్న రాసుతుల చెంతఁ బకాపకలాడు నవ్వులో
లజ్జకుఁ దావులేదదౌక లౌకికసంఘటనమ్ము గావలెన్.

ఆ నగ పూర కర్థ మగునా ? షాలిదేవుల కింతలోన న
మ్మానిని తేరఁబంచినకుమారజనోచిత వస్తు లిస్తువుల్
కానుకవెట్ట నిర్వ్వ రవి గైకొని కన్నుల నూత్నసమ్మద
శ్రీ నటియింప నింపుగ వచించెమువారి కనుఁ వినమ్రమై.

నాయకురాలు

ఇప్పుడేని మీ కించునే పడదేర్చు
ద్రాక్షాసవమ్మదే త్రావుఁడన్న
పెందోలల్ చవికిఁ గావింద రసావళు
లింపుగూరఁగ నారగింపుఁడన్న

పైఁడి చల్లడము లింపవు మానికపుఁ జడా
వులు దొడి చేసేయి గలుపుఁ డన్న
సెలవిండ్లు తగ వుక్కుసింగాణిమోపెట్టి
తడయక బయలూడఁ బొడువుఁ డన్న
సన్నగాళైకన్న జమిళిగ మేల్తర
మ్మొరుగుమెఱుఁగులద్రువఁ జఱవుఁడన్న
రాచబిడ్డలకుఁ బరాకుండ దందులో
అనుగురాజు బిడ్డలయ్య! మీరు.

శ్రీదేవిశుద్ధాంతశిఖరాగ్రభాగమ్ము
లీఁగిపోవఁగ బాణ మేయవలయు
వీరభద్రాలయవీధి గోపురశిఖల్
తల్లక్రిందుగ గ్రక్కు దల్పవలయు
కోటగడ్డల బయల్ గోరాడునేనుంగు
గుబ్బకొమ్ముల నూఁడగొట్టవలయు
మాఱాడ కందంద మసలు కొజ్జాతీవ
చొళ్లెమ్ములకు గుఱిచూడవలయు
ఉరకనగళుల మిడుకుచు నుమ్మలింతు
రా! నిజమ్ముగ మిమువంటి రాచవారు
పార్థివుఁడు కిమ్మనినఁ దన బైసిగడిగి
మిమ్ము మెఱయింతు ననుఁబట్టి మొలఁగుఁ డంచు

ప్రొద్దుసూచి రాజపుత్రుల నుసికొల్పి
హస్తకౌశలమ్ము లరయఁగోరె

ఆమె మాయాఁదవిలి యల్లు రాజకుమారు
లంతుపట్టఁ కిట్టు లడరినారు

కోటబురుజుమ్రోలఁ గూర్చుండి నాగమ్మ
గుఱులుసూపి కన్ను గిరుపుచుండ
అన్నదమ్ము లిర్వు రాలీఁక పాదులై
జబ్బచఱచి కోటగుబ్బటిల్ల

సెలవిడ్లంది పరస్పర మ్మోడపెడన్ శ్రీదేవి శుద్ధాంతమున్
గలువో నేసిరి వీరభద్రుఁ డడి మొక్కల్ వోవ భంగించి రా
వల దంతావళమున్ బడల్పఱిచి రావై గోఁచలన్ సందుగొం
దులువట్టించిరి రుంజలం జఱచి రందున్ దృష్టి చేసారమిన్

కేళాకూళులఁ జల్లులాడి రవలన్ క్రీడాస్థలాభ్యంతరో
త్తాల స్తంభము లెక్కి ప్రొమ్ముగ్గతిలి రంతన్ బందెపుంగుండ్లు కెం
గేలంబట్టి తెరల్చి రప్పటికి నాక్షేపించునాగమ్మ కిం
కేలా మెప్పు ఘటిల్లునం చిరువు రేమేమో ప్రదర్శింపఁగన్.

నాయకురాలు

పకపకలాడి హా స్తమొక ప్రక్కకుఁగా నటు మోరగా నడల్
చికపికగా నృపాత్మజుల చెంగటికేఁగి యనుంగురాజ పు
త్రకు లనింపించు కొన్న సరదా కనుకట్టదె ? నాగసాని యీ
తికమక గారడీలెఱుఁగదే ! బుడిబుచ్చికముల్ గణించునే ?

వింతఁగఁ జూతు రేల ? కులవిద్య గదా? విలువిద్యమీకు మే
మెంతప్రయాసపడ్డ లభియింపదు లాఘవ మట్టిదెల్ల మీ
వం తయినన్ గుణాగుణ వివక్ష తగున్ ననుబంటివారి కీ
సంతన మున్నె యుంగుదుఁ బ్రశంసకుఁ గ్రొత్తదనమ్ము గావలెన్.

అని మొగమెత్తరివ్వ్యమనె నప్పుడమింటి దెసన్ దదార్భటుల్
విని కనుగొన్న దల్గుపృథివీపతి పెద్దసుతుండు నేరుగాఁ
బెనిచిన పావురాలు రొదపెట్టి పరంజిన వంచు నిట్టి వీ
లునకె తపించె నీక్షణములో నది సేకురె నేమిచెప్పుదున్.

నలగాముం డెడప్రొద్దుగల్గఁ జని జాటల్ గూర్చి పారావత
మ్ముల విస్వీథికి నైచి పట్టునెడ పమ్ముల్ దప్పి కొన్నందులోఁ
దలక్రిందై మలిదేవభూపతుల సౌధశ్రేణిపైఁ బాఱె న
వ్వలుఁగుజ్జంటలఁ జూపి యాపె తన నేర్పుంగూర్పుదీపింపఁగన్.

ఆజంటన్ బడనేయుఁ డీదృశ ధనుర్వ్యాసంగముల్ గ్రొత్తలా
నాజుంబాజుల మెచ్చుకోళ్ల కొఱకు విద్యాద్విక్రమాటోపులై
రాజుల్ రచ్చల మచ్చరింతు రని దర్పం బేర్పడం బల్కు నా
వాజమ్ముల్ గుఱిపెట్టి కొట్టి రకటా! పారావతద్వంద్వమున్.

మెచ్చిన దింపులోలకుఁ జని మేదకులన్ దన నింపుకౌఁగిటన్
గ్రుచ్చిన దింతలోన ముకుఁగ్రోఖుల నెత్తురుచిందఁ బావురా
లుచ్చిన గుండెతో మునుగులూడిన ఱెక్కలతో గులాబి పూ
గుచ్చములట్లు నేలపయిఁ గూలె జనుల్ వెఱఁగొందికుందఁగన్.

గుంజె గతుక్క మన్న దటకు న్నలగామనృపాలుఁ డంపితే
తెండన వారి కుస్సురని తెచ్చి మహీపతి కిచ్చి వారొడల్
మండి వగర్చుచుండఁ బదిమంది యదేపని దూఱఁజొచ్చిరే
మొండి ఘటమ్ము లిట్లుపడమొత్తెనొ తేలక సంశయించుచున్.

నెత్తురుముద్దలఁ బోతముగ
నెత్తిమొడల్ నిమిరి పాప మీ పులుఁగులకున్
బత్తెము దీఱె నిఁకేమని
చిత్తము నీఱయి నృపుండు చింతిలుచుండన్

ఊరక జనప్రవాహము
దారుల కెడసొచ్చి పాఱు తెఱవై యురవై
నోరాక తీరై రాజ
ద్వారము కిటకిటన దవ్వుదవ్వుల విఱిగెన్

వెక్కుచు ప్రొక్కుచుఁ గొందఱు
ప్రక్కలు డొక్కలను నదిమిపట్టుక కొందఱ్
త్రొక్కువడి నృపతిచెంగటఁ
గ్రిక్కిరిసి వచించి రైన కీడ్పాటెల్లన్

నాయకురా లంత నయగారివోలె
గుంపులన్ దలఁగించుకొని యేఁగుదెంచి
ప్రజకైన దుర్భరాపదకుఁ జింతించి
గూఢచారులఁ గన్ను గొల్పి రప్పించి

నలగామభూపతి తలనేలఁ బడఁగ
బాలమద్దేవ భూపతుల చెయ్దములఁ
గాఢోడ్డైములతోడ నూఱిపోయించె
నృపతి మాటాడక నిట్టూర్చినాఁడు
పాలువోక శిరమ్ము వంకించినాఁడు
తుద కేమిదోఁచక పెదవు లాడించి
తన యుపేక్షయ యింతకును దెచ్చెననుచుఁ
గన్నులదైన్యరేఖలు గీలుకొనఁగ
వీరమల్లుని దెస వీక్షింప నతఁడు
గౌతరాజాదులఁ గడచి మున్ముందు
ప్రక్కలఁబడి రోలుపసివాండ్రఁ దేర్చి
మూపులఁబడి తూలు ముదుకండ్రఁ దేల్చి
గూబలఁబడి స్రుక్కు కొజ్జాలనుడిపి
ఆయుముల్ దెగిపోకున్నదలన్ దనిపి
వారు వీరన కెంతో గారాబ మెసఁగ
గాయపడ్డజనమ్ము కలవర మ్మాపి
అవసరమ్ముల కీయనంపె లేకరిని
అంతట మందిరాభ్యంతరమ్మునఁ
బసిఁడి పచ్చలగద్దెపై మేను వాల్చి
ఆలోచనామగ్నుఁడయ్యె భూధవుఁడు

ఆమంత్రితులు మంత్రులతని కట్టెదుటి
కనువుగా నటునిటు నాసీనులైరి
కోలాకోలలాడుచు నరిసింగరాజు
నాయకురాలి చేచాయఁ గూర్చుండెఁ
బలువురు మొగమొగమ్ములు చూచుకొంచు
గ్రుక్కిళ్లు మ్రింగుచుఁ గూరుచున్నంత

ఎంత దురాకృతమ్మని వచించెనో? లేదో? నృపుండు తమ్మునెడ
త్యంతనుపాకపాయిత దృగంచలుఁడై నలగామరాజ! నేఁ
డింతటఁ బోయినారు నయమింక నిను న్ననుఁ జుట్టఁబెట్టలే
దంతమహానుభావు లిపుడైన యథార్థము గోచరించెనా?

నెత్తిన నోరు వెట్టుకొని నిచ్చలు నాయకురాలు నేరుగా
మొత్తుకొనన్ గణింప కొడమల్గిని గీటునఁ బుత్తువా మదో
న్మత్తుల దుష్కృతమ్ములొకమమ్మ! మిమ్మనిగాదు మొత్తము
వ్వొత్తుగొనన్ బయల్పడిన పీశ్వర నిర్ణయ మెట్టులున్నదో?

నలువురు విన్నఁబక్కఁమని నవ్వెదు రన్నిటి కిర్వురొళ్లపైఁ
దెలియక పెచ్చరిల్లి రలంతిన్ జనవిచ్చిన మూఁడకున్నె? యె
వ్వల నయినం దొలంచు టిరువాఁగులకున్ శుభమంతటంతటన్
గలుగుదు రింత లేసి బెషగాఁయుల కా తెలివంతు పట్టునే?

పరులేమన్న రనంత సిగ్గుపడ రీ పాపాత్ములిప్పట్లఁ గా
వరమెంతేనియుఁ గన్నుగప్పె; భుజదర్పంబున్న నేర్పేర్పడన్

బరరాజ్యమ్ముల కెత్తరాదె? శవశ్రీప్రసాదముల్, గళ్లు, గో
పురముల్, శత్తులు, వృషముల్ మగతనంబుల్ చాటుకోఁ దగ్గవే!

తనబాటిచ్చట సాగనేరదను చింతన్ బ్రహ్మయామాత్యుఁ డీ
పనికిన్ బాల్పడె సీతతంగములు చిల్వల్ పల్వలై మొన్న మొ
న్నన వెల్వడ్డవి నోరునొక్కుకొని విన్నన్ గన్న నెవ్వండు పై
కన లేదన్నఁ జెడున్ బడున్ బరులకేలా యష్టకష్టంబులున్

మన యభ్యున్నతిఁ గోరువారి కలుగున్ మాటాడినన్ గోటగో
మ్ములనకుందార్చుఁ దనంతవారిన సిశమ్ముందేర్చుమాబోంట్లఁ గై
కొనఁ డైనన్ బలనాటి దేవుఁడని లోకుల్ నిత్య మగ్గింతురే
మనువాఁడన్ మన వీరవైష్ణవుని చర్యల్ వాకొనన్ శక్యమే?

ఏమతమైననేమి? ప్రజకించెడి దాతని వీరవైష్ణవ
మ్మేమతమంట, దేవుఁడతఁడేనఁట, తన్ను భజించువారికే
కామకమోక్షమంట, మతకర్తలలో యతిరాజతత్వ మా
మోమున మొలకెత్తెనఁట మోసము, దోసముగాకిదేమగుణా

మతమని వేవగల్ మిసుకుమంత్రులొనర్చెడు కార్యముల్ ప్రజా
హితములుగా వ్రతమ్ము నియమించు నృపుండు స్వతంత్రుఁడైనచో
వెతలకుఁ దావులేదు పృథివీపతి చిత్తమె యుంగ లేని యీ
మతకరిమంత్రిమూలమున మాకగచాట్లు ఘటిల్లకుండునే?

తమ్ములఁ జీల్చినాఁడు తనదారి కమాంతము ద్రిప్పినాఁడు కీ
ల్బొమ్మలొనర్చినాఁడు మనపాత్రిఁక బొత్తుగ గిట్టనీయకా

గమ్మునకెత్తినాఁడు కనుగల్గుట మేలని కోరమీసలన్
జెమ్మటగ్రమ్మదేర నరసింగనృపాలకుఁ డొత్తి పల్కినన్

నాయకురాలు లేచి నరనాథున కిట్లను వారు సెప్పిన
ట్లా యసమానగౌరవము లాతని కే తగు నెవ్వరో? పశు
ప్రాయులొనర్చు చేష్టలకుఁ బాల్పడునా? సుజనైకజీవనుం
డాయువృష ల్లెబింగి తుద కాఱఁపుచ్చెద రల్పు లీక్రియన్

ఉపధాశుద్ధుఁ డమాత్యుఁడు
నృపతికిఁ గడు కూర్చునంత్రము నీతివిదూరుం
డపరాధ సహస్రముగా
విపరీతము లాచరించి పీడ్పడు నధిపా!

అన్నిటికైనవాఁడు తగవాడి వివేక మెలర్పఁ బ్రాభవా
భ్యున్నతిఁ గోరుఁ గాని యిటులూరక చిచ్చుబికించి నాశనం
బెన్నఁడుఁ గోరఁ డైన మన కేర్పడఁ బల్కు కులక్రమాగ తో
త్పన్న పథంబు వాసి చనువాఁడగు నే నది కొంతమే లగున్

మలిదేవాదులు మచ్చరించినను ధర్మస్థాపనాచార్యుఁడే?
కలఁతల్ పాపి తెలుఁగుసేయఁదగఁడా? కాదన్న వాదించి క
ఱుల కళ్యాంబయి గడ్డుదేలిన నెడరోఁకఁ దగ్గవాఁ డెవ్వఁడా
నిలువెల్లన్ విషమున్న దిన్నిటికి మన్నీలాధ్యు లేమందురో

మనమీర్ష్యాళులమంచుఁ జాటునఁ జెముర్మార్గుండు నేఁ డెవ్వరో?
కనుపట్టింగదె? ధూర్తుఁ డన్నిటికిఁ గాకల్ దీర నం బేదలన్

దనకుం దోడయినిల్వనాడ దొరకొన్నాఁడింతకీ రాజశా
సనముద్రిక్తముగా దిశేల పతిశిక్షాదండ మీక్షింపదో?
తానేయుంచుటకైన వెల్లెడల శుద్ధాంతప్రదేశంబులే?
న్యూనత్వంబుగణింపనేరని ప్రధానుల్ కార్యనిర్ణేతలే?
జ్ఞానానందుఁడఁటే మహాత్ముఁడు తదీయజ్ఞాన సంపత్తిటుల్
రాణించెన్ గతదాష్ట్యముల్ మనకుఁదారాకాణమ్ములిప్పట్టునన్

అని నరసింగరాజు మొగమూరసె నాతఁడు వీరమల్లునిన్
గనుఁగొని నయ్యమాత్యుఁడెడఁగల్గ నొకించుక రాజదృష్టికిన్
జనవరియై పరిస్థితులచందములందులకుం బ్రతిక్రియల్
వినిచిన నిశ్వసించి పృథివీపతి లేఖలిఖించి పంపినన్

వీరమల్లుఁడంది పేరుమాత్ర పఠించి
నాగమాంబ కంచినన్ గ్రహించి
విచ్చి చూచి లేచి వికసన్ముఖాబ్జయై
ప్రణతులాచరించి బయలుదేరె

అడుగడుగంతరాయమునకైన గణింపకమున్ను కోటలో
నడిపినదానికైనపరిణామ మెదన్ గుదియింపఁ దోడుతో
నడరిన పాపభీతి వెనుకాడ దివాణము మేలిమెట్లపై
నడచుచు వీరవైష్ణవుఁడు నాయఁడు గుప్తికిరా నదాటుగన్

కాలునేలఁ దాఁచి కటకటాలు ద్రోఁచి
గోడ కొత్తగిల్లి కొంతతడవు

చేరదేసి కనులఁ జివురు వన్నెలు కొన్ని
తనక మాడ నిట్టులని తలంచు

పాపమెవరి దింక బ్రహ్మన్నదనుకొందు
నతని కాళ్లుపట్టి రథిపసుతులు
పంతమూని వీని పసకట్టఁ దలకొన్నఁ
దదనుయాయులకును బదవ లోదవు

ఇనుము కతన నగ్నికిని బోటుతప్పదు
ప్రొద్దుపీరినొసటఁ బొడిచె నేమి ?
వీరిలావు సూచి విడిచిపుచ్చుట కల్ల
చుట్టఁ బెట్టి కాలమట్టగింతు.

నేనకాదు రాజనీతిజ్ఞులెల్ల రీ
కపట తంత్రములకుఁ గడఁగవలయుఁ
దగిలిరానిపట్లఁ దనబిడ్డలను సైత
మొక్కఁడైనఁ దాట లోలువవలయు

కపటధర్మకంచుక మ్మార్నఁ బట్టక
పాపమంత బట్టబయలుగాదు
ధర్మరాజునరక తైతక్క లాడించె
ఆము దిన్న పసరమై యితండు

ఇన్నినాళ్లు దిన్న దెవరబ్బ సొమ్మని
చేసెనంట గతుకు వేపరంట

వీలుపడిన దనుక వేలార్చి తిన్నాఁడు
గిట్టకిపుడు దూయఁబట్టినాఁడు

సచివులైనవారు స్వామిహితార్థులై
కలఁత లలత లుడిపి మెలఁగవలయు
ఇంట బైటఁ బూసికొంటకీ యధికార
గర్వ మేరికైనఁ గాదుసూవె?

ఆఁడుపొత్తుగిట్ట దతఁ డూడిపడుకొట్లా?
పరులు విన్న నెంత పలుచఁదనము
ఇంత పచ్చిబూతు నే నెన్నఁ డెఱుఁగను
లేశమేని సిగ్గు లేకపోయె

తగవరంట వీని తల నేలఁబడిపోను
పచ్చిగంగ పుట్టనిచ్చినాఁడె
ఇంక నయము ప్రభువు లింగితజ్ఞులుగానఁ
దుట్టతుదకు గడపఁ ద్రొకిఱినాము

అతని యన్నదమ్ము లందఱు దామెద్దు
లందుఁ బెద్ద నాయఁ డడవిమృగము
ఇతని కన్నియెడల నెనవచ్చు మొనగాఁడు
మాలపోతు మాఱుమసలుచుండు

కూటువేర్చి వీరి గూర్పెట్టుకొనివచ్చి
పొడిచిగెల్వఁ దనకు బుద్ధిగలదు

కడచి బ్రతికి బట్టగట్టిననాఁటికిఁ
దేలఁగలదు తొందరేల చెప్పుము?

వైష్ణవమ్ముపేర వైరులసాధింప
నిన్ని కుంటుచికుట్ర లెవఁడుపెట్టు
శైవమతము నణచి చక్రమ్ము ద్రిప్పుట
కిట్టి దుష్ప్రచార మెవఁడు సేయు

నాఁడు నేఁడు బ్రహ్మనాయని కే తగు
నైనఁజూతు నితని యతిశయమ్ము
గోడుగుడిపి కడకు మూఁడు చెప్పులనీరు
త్రాఁపకున్న నాఁడుదానఁ గాను.

నాలో విక్రమ మీటువోయె ననుకొన్నాఁడేమొ? శౌర్యానల
జ్వాలాభీలరణాగ్రభూమిఁ గని నిర్వ్యాపారతన్ ముక్కుపై
వ్రేలేమోపునా? నాఁడు సిగ్గుపడి గంభీరించునో? చూతు నీ
వేళాకోళ ములాకళించుటకునై వెన్నుండు వేంచేయఁడా?

నగుబా టెవ్వరికందు రర్భకుల నన్యాయంబుగా గోత్రద్రో
యగ నుంకించిరి శైవవైష్ణవ మతవ్యాపారులీ గాథపూ
ర్తిగ గుర్తించిన వారు నన్ననరు మంత్రిత్వమ్ము వెల్గించుచున్
మగవాఁడై తెగఁజూచె నందు రిదిసంభావ్యమ్ము కాదందురే?

తెలుఁగుం గాంతల వీరవిక్రమ కళల్ దీపించు భాగ్యమ్ము నా
వలనన్ జేకురెనంచు గర్వపడెదన్ బ్రహ్మన్నమూలాన స్త్రీ

బలసంపత్ప్రతిపత్తు లెల్లరకు విస్పష్టంబులై తీరు నాం
ధ్రుల దర్పోజ్జ్వల వీరగాథ లిలఁ బర్వన్ విప్లవోచ్ఛండమై.

నారక్త మ్మొకబొట్టు చింద నెఱుఁగండా వేలకున్ వేల సృ
గ్ధారల్ నేలఁదోరంగు నుఱుకన్ సైడి డొక్కల్ డొల్లు నిర్జీవమై
ఘోరాజింబడు వీని మేనిపయిఁ గాకుల్ గ్రద్ద లత్తాడఁ గ
న్నారం జూచినఁ గాక నాహృదయసంతాపమ్ము చల్లారునా?

ననుఁగాదన్న నిమేషమాత్రమునఁ బల్నాడెల్ల భస్మమ్మొన
ర్తును నాగానదిఁ ద్రోతు నా యనికి నఁతుం బట్టలేదా నికృ
ష్టుని వాతావరణమ్మె వేరు తనపోఁజుల్ దాను దోఁతెంచి ని
ల్చిననాఁ డప్పటికప్పు డర్థ మగు నీ స్త్రీసాహస మ్మెట్టిదో?

నాయత్నం బెపుడైనఁ బౌరుషప్రధాన మ్మజ్ఞు లెందేని దై
వాయత్త మ్మని నీరసింతురు మదీయారంభముల్ సంతత
శ్రేయోదాయకముల్ పరాజయములే జీవించినన్నాళ్లు నా
చాయం జూడవు చూచినన్ వెఱవ నీషన్మాత్ర మిప్పట్టునన్

గత మర్థింప భవిష్యదర్థమున కా కాంక్షింప లోటేమి నా
కతఁ డర్థింపకతీఱ దింతగలవాఁ డన్యాయమో? న్యాయమో
సుతరా మయ్యలకొల్లు పట్టవలె నాజుంబాజ లందాఁకి తా
నతి వీరుం డనిపించుకోవలె మతవ్యాపార మేపారఁగన్

అదిగో లోక మెదిర్చినన్ సరకుచేయం డాము బెద్దంబలెన్
బెదరించున్ ముకుఁద్రాటఁ దేఁబనిచి పృథ్వీభర్త వీక్షింపఁగా

గుడిత్రోయింతు నెదిర్చి పైకొనిన నుగ్గుంబ్రాలు గ్రక్కింతు ని
ష్పదళ మించుకవాఁజేసినన్ భయ మెఁర్పన్ బైటకీడ్పించెదన్.

అని చిమ్మచీఁకటిం దన
కనుఱెప్పల నూలుకొల్పి కనుఁగొని యేరా !
పని మఱచితిరా ? నడిసె
త్తిని గొఱకొయ్యలు మలంగెఁ దెలియుట లేదా ?

పదఁ డిటు లని మలిదేవుల
సదనము దెసఁ జూపి వెనుకఁ జన భటు లంతన్
ముద మెదలఁ బొదలఁ జీఁకటి
మడుగుల నొదిగొదిగి చనిరి మలువున కొకఁడై

కోటబురుజు క్రిందఁ గూర్చుండి రేవురు
కోట దాఁటి రాఱుగురు బలాఢ్యు
లందు గుండనాయఁ డగ్రేసరుం డయి
హెచ్చరింప నగరు సొచ్చినారు.

గుప్పు మని దివ్వె లాఱిన
చప్పుడు విని యల్లురాజజనపాలసుతుల్
ఱెప్పలు విచ్చి రమాంత
మ్మప్పుడ పైఁబడిరి కిక్కురన నీ కార్వ్వర్

నోళ్లు లడంచి "లగాలగి"
గాళ్లులు చేతులను గుదియఁగట్టి ముసుంగుం

ఢోలలఁ జేరిచి చేరుల
మూలమ్మునఁ గోటబురుజమూలకుఁ దార్పన్

ఇంతకుమున్న కాచుకొని యిచ్చటుపొంచిన పెద్ద నాదులీ
సంతన గుర్తెఱింగి రభసమ్మున పైఁబడి వారి సేవురన్
గొంతులు నొక్కి గూళ్ళదరఁగొట్టి బడల్పడఁ బాఱఁద్రోలి యా
ప్రాంతమునంద నిల్చి రటుపై నిది సంఘటిలెన్ హఠాత్తుగన్

ఆడోల లెత్తుకొని వీ
రూఢనిఁబాడిరి సమధిగతోత్సాహమునన్
నాడులు దెగి నాయకురా
లీడిగిలఁ బడెన్ రహస్య మేటం గలసెన్

ఆరేయి నిదురపట్టక
వీఱిఁడి క్రియ నాయఁ డింట వేగించుతఱిన్
వీ రరుదెంచిరి రాజకు
మారులతో వింతగొల్పు మైమఱువులతో.

రాచబిడ్డల దురవస్థఁ జూచి స్రుక్కి
కట్టుద్రాళ్ళూడ్చి మనసారఁ గౌఁగిలించి
అమ్మ శీలమ్మ దేవిడీ కనిపి తాను
పెద్దనాదులతో నాఁటిప్రొద్దు గడపె.

# నాయకురాలు

## సప్తమఖండము

రాజాంతఃపుర మప్రసన్నపరివార మ్మప్రవిష్టప్రజ
మ్మాజంఘాకరికాకులవ్యపదిశ మ్మారబ్ధతౌర్యత్రిక
మ్మాజానేయవిరాజితాజిరతలం బై ప్రాజ్ఞభోభిత్తికా
రాజద్భానుమరీచివీచికలలో రంజిల్లెఁ గ్రొంజాయలన్

ఆసౌధచంద్రశాలిక
దాసీజనరచితకుసుమతల్పంబునయం
దో సరిలి దుర్జయాన్వయుఁ
డాసాదితవిధివిధానుఁ డై తోడ్తోడన్

కన్నెగేదఁగివన్నెసన్నపుట్టము గట్టి
కొనస లుచ్చిపోఁ గాసెకోకఁ జట్టి
జరిబుటాపనిదంపుటరచట్ట ధరియించి
పచ్చలపతక మాపై గదించి

బూతళించుపసందు భుజకీర్తులం దాల్చి
రవ్వలకలికితురాయి వెట్టి
పాముమీసమువోని కసిఁడిబెత్తము పూని
గొనబుటంచలపావకోళ్లు దొడిగి

పసిమిదుప్పటివలెవాటు దుసికిలంగ
గంబురాగులుకఁ దాంబూలడంబరముగ
భద్రగజ మెక్కి నిజసభా భవమునకు
విభవదేవేంద్రుఁ డై రాజవీథి వెడలె

ఇరుపార్శ్వమ్ముల రాజబంధువులు ప్రత్యేకాప్తు లేతేర సో
దరు లారూఢతురంగముఖ్యు లయి శ్రద్ధాభక్తులన్ గొల్చి రాఁ
బురమార్గమ్ము క్రమించి పాపమునిశంబున్ గర్భదుర్భేద్య ని
ర్భరచింతాపరితాపతప్తుఁడగు భూపాలుండు నింపాదిగన్.

కొలువు డాసి భద్రకుంజరమున్ డిగ్గి
సభ్యు లెదురునడచి సంభజింప
సింహాపీఠ మెక్కి చెంత లింతలు గాఁగఁ
గొలువుకూట మరకఁ గలయఁ జూచె.

రాజువలపట నరసింరాజు వాని
పజ్జ నాయకురా లామె ప్రక్కఁ గొత
రా జతని వెనుకఁ మల్లుఁ డియ్యోజ సచివు
లా సభాస్తారు లాసీను లైరి నాఁడు

కుడివలను గూరుచున్న నాయఁడు వెలార్చె
వేఁడినిట్టూర్పుఁ దక్కినవీరమల్లుఁ
డాదిగాఁగల మంత్రు లియ్యంతరార్థ
మెఱిఁగి యెఱిఁగి యుఁ గన్నెత్త వెఱచినారు.

గాతరా జేమొ? వాక్రుచ్చుఁ గాని నృపతి
కింపదయ్యెఁ దదీయార్థ మీసడించి
రవలివా రంత నివలివా రనువదించి
రాను కా దన్నచర్చ లిట్లతిశయించె

నరసింగరాజు

గాతరాజు నెవరు గాదన రిప్పట్లఁ
జిన్నతనపుఁజేష్ట లన్న నగరె?
పాఁపజాతి నెవరు పాల్వోసి పెంచెద
రెట్లు చెప్పనేర్చి తింతదనుక.

ఇల్లు గుద్దలించి కొల్లే రొనర్చెద
రీరు చెప్పినట్టు లూరకొన్నఁ
బరులు తారు గలిసి పన్నిద్దరాళ్వారు
లింక నేమి యూళ్లు లెత్తఁగలరు.

కుడిచి కూర్చుండ నేఱక కొందరయ్యా
లిల్లిలారముగాఁ బ్రయత్నించినారు

దొంగలకు నీళ్లువోసెడి దొరలకతన
గుట్టుఁబేడున మనకొంప గూలితీఱు.

ఎండఱకు నీళ్ళుదోడని దింతలైరి
ఇంటిదొంగను బట్టుట కేరితరము
గుడిగుడారము దిగ్రమింగు కుటిలచిత్తు
లెంతచేయరు సేయింప రివల నవల

గౌతరాజు

కచ్చెకుఁ గాలుద్రవ్వెదవు గౌరవ మారయ వెట్టు నోరికిన్
వచ్చిన నట్టు దూర మఱవం దగునా? నరసింగరాజ ! వా
క్రుచ్చు నెడన్ వినింద్యములకుం జొరఁగూడదు విన్నవల్వురున్
మెచ్చవలెన్ మ ఱిట్టు శ్రుతిమించి వచించుట పోల దేరికిన్.

అన్నలుఁ దమ్ము లేక మయినట్లయినన్ మిముఁ జేరిచూడ లే
రన్నది తప్పా ? స్వార్థపరు లాడిన పుఁకొని మేరమీరరా
దన్నది సొడ్డా ? మాపదవు లర్థము గా వెటులన్నఁ గష్ట మిా
సన్న మెఱింగి పల్వురు విశాంపతులౌ దలఁదాల్తు మంత్రులన్

పో రొడఁగూర్చి కట్టుకొని పో మిదిగాఁ బ్రజ దుర్భరాపదన్
గూరు నొకళ్ళొకళ్ళడఁచికొందు రరాజక మప్పతిల్లు నీ
ధోరణి కే ప్రజాప్రతినిధుల్ దల లొగ్గరు ప్రాణగొడ్డముల్
గోరరు ద్రోహచింతనలకుం గుఱిగా రెవ రారటించినన్.

పూజ్యులఁ గొల్చి మాకడుపుఁ బ్రోచికొనం దలపోసికాదు మీ
ప్రాజ్యసుఖానుభూతులకుఁ బొల్పడి కాదిటు లంట ధర్మసా
మ్రాజ్యమువర్ధిలన్ బౌరుషమానిసహోదరులొండొరుల్ సదా
రాజ్యసముజ్జ్వలచ్ఛుభపరంపర చూఱకొనన్ వచించితిన్

చి చొప్పడిగట్టు లే లని వచించెద దేశము నిద్రగూరి లే
దిచ్చకు వచ్చి న ట్లనుభవింపఁ దదద్భుతశక్తి కన్నులన్
విచ్చిన దొక్కమారు పృథివిం గబళించుట వాస్తవంబు మా
ర్పిచ్చట నెప్డుఁ గద్దు గమనించుచొ దుర్ఘట మెంతవారికిన్

అడుగడు గెన్ని మాఱుపుల కైనది? తీఱనికష్ట లెన్ని యే
ర్పడినవి కాలచక్రపుటరంబడి సారె భ్రమించుచున్ సుఖుల్
సుఖు లయి రాలిపోదు మొకచో గుమిగూడినఁ దల్లక్రిందులై
పడుదుము దీని కింతచలపట్టి వివాదము లాడఁగూడునే?

హక్కులు గోరుకొందు రెవరైనఁ బ్రజాహిత మాచరించువా
రొక్కటి కాదు కూడ దనిరో? వెనువెంటనె విప్లవంబు న
ల్దిక్కులఁ దాండవించు నిదిదిద్దుకొనన్ బరమేష్ఠి చేతఁగా
దిక్కువ లాకళించి సవరించినఁ జక్కఁబడున్ సమస్తమున్.

అన విని వ్రేటువడ్డపులియై తల వీడ్చుచు నాగసాని య
జ్జనపతిదిక్కు మో మయి హాసా దనుచున్ మనగోతరాజు నే
ననుకొనినంతవట్టును సమర్థుఁడు నేఁ డిది స్పష్టమయ్యె మీ
కును నిఁక వేఁడినీళులకుఁ గొంపలు గాలునుగావలెన్ బ్రభూ!

బాహ్యవిప్లవమ్ము భరియింతు మింతకు
నింటిగుట్టు రచ్చ కీడ్చినారె?
పీకె లొడియుదనుకఁ బిల్లిశీలమ్మును
చీకు లెడయుదనుకఁ జిలుకచదువు

మంత్రికుండఁ దగినమర్యాద లెడలిన
మొక్కలీఁడు సభకు నెక్క నేల?
గ్రుడ్డువచ్చి పిల్లకుఁ బుద్ధిగఱపిన
ట్లదవ కేరడమ్ము లాడఁదొడఁగె

నోరు విచ్చి రేని శ్రీరంగనీతులు
చేతు లార్చి రేని చిత్రవధలు
కాలు సాచ్చి రేని గోముఖవ్యాఘ్రముల్
నోటఁ బండ్లఁ బెట్టి నుడువ భయము.

గౌతరాజువంటి నీతిసంపన్నులే
తిన్నవారినెఱసు లెన్నుచుండఁ
బల్లెనాడు దగ్ధపటలమ్ము గావింప
స్వాము లెంత కేని చాలరనము.

ప్రజల మోసగించుభక్తిప్రపత్తులు
రచ్చ కెక్కి గెలుచు రాజనీతి
కొల్లగొట్టి తినెడుగుండాల గొడవలు
చేతవాతఁ గావు జీవితమున.

శ్రీవారిసేవనమె మా
జీవితపరమార్థ మని భజించితి మిదిగా
సేవగలు గొలిచి గిట్టక
కావలమునఁ బలుపః జెలువఁగామని చెనకన్.

ఆస్తోత్రాసవచోవి
న్యాసమ్మున కుడికి నాయఁ డనవసరరసా
భాస మ్మగు నని వింతవి
కాసమ్మున నృపతిదెస మొగమ్మయి పలికెన్.

ఈయుల్లకుట్టుమాటలు
తీయుము గా వెంత మేము తేకువ సెడినన్
మీయయ్యఁ గొలిచి బ్రదికిన
పాయకుఁ జెందితి మ దేనిఁబాటింపఁ దగున్.

కొమ్ములు మొలిచిన మీమీ
సమ్మతిమై నడువవచ్చు సైదోడులసే
మ మ్మనక మమ్ము గైకొన
కిమ్మెయిఁ బలుపన్ గణింపరే యొరు లెందున్.

నొవ్వం బలికినఁ గా దన
మవ్వాలిలక్షణము నృపతు లాశ్రితుల నిటుల్.
దవ్వులఁ బోనిత్తురె? కా
ల్దువ్విన సైరింతురే? పరుల్ వినినగరే?

పేడికిమీస లంటే? నెఱ
దాడినపసరమ్ము లంటె నృపా! మానాడుల్
తోడించితి రెన్నాళ్ళీ
కోడిగముల్ సైచి మిమ్ముఁ గొల్తుము చెపుఁడీ?

పలనాటి కొకటిపుట్టినఁ
బాలుపేదఁగ మమ్ము దెప్పిపొడుతురు లోకుల్
నిలువున నెత్తురు ద్రావెడు
పులులం గొలువుంచి పొరుపు పుట్టించితిరే?

కులశీలాదులనెపమున
వెలివృత్తము లుగ్గడించి పీ లగునెడలన్
దలగిల్లియు మొలవేయం
దలపడినా రింతకన్న దౌష్ట్యము కలదే?

ఏ నసరాదు మీ రెఱుఁగరే? మలిదేవులసాధువృత్తముల్
తా నొనరించుతప్పిదములన్ గమనింపరు నిన్న మొన్న మా
కైనపరాభవంబుతమ కైనఁ దలన్ దఱిగింతు రింతవి
జ్ఞానధనుండ వయ్యుసహజన్ముల నొప్పరికించితే ప్రభూ!

పెఱచింత లెఱుఁగని పినతమ్ము లిర్వుర
కుక్కుటకత్తులబోను లొడ్డుటేల?
రండు పొం డని నిండురచ్చల కెక్కించి
పలువురలోఁ బాఱఁబట్టు టేల?

"వచ్ఛందము"న మతవైషమ్యములు పెంచి
ఊరూరఁ బనివడి దూఱులేల?
మాగాలిచిట్టాడు మార్మ్ముల రెండైన
గాలించి వార్త లాఁకట్టు టేల?

వారు మీరుఁ గలిసి వాల్లభ్యవైభవ
మనుభవింపుఁ డెవ్వ రడ్డువారు
పాప మొకరి కందుఁ బ్రతిఫల మ్మొకరికా?
యుభయు లాత్రిగూరు టొప్ప దధిప!

నాయకురాలు

ఎంత తెఱంగు మాలి వచియింతువు నాయఁడ! దుర్విదగ్ధసి
ద్ధాంతివి ధూర్తమానవహితవ్యవసాయికి ధర్మమర్మవి
త్సంతతి కెంతమాత్రము పొసంగునె?సర్వము ధారవోసి పో
నెంతువె నీకు,నాకుఁగలదే విడువన్ ముడువన్ గడింపఁగన్.

ఉభయుల మందు మిందెవరి కున్నది హక్కతఁ డొక్కఁడే కదా?
ప్రభువు ధ్వనించుచున్నది భవద్వచనమ్ముల ద్వైధ మెంచు నీ
ప్రభ మునుముందు సాగె నిటువంటికుతంత్రము లింక సాగ వీ
సభికుల కిందుమూలమున స్పష్ట మగున్ గపటప్రచారముల్.

నీప్రజాస్వామ్యదురభిమానప్రచార
మింత లింతలఁ బల్లెనా దేవగించు

రాజవిద్రోహమునకు దురంతచింత
లవసర మ్మని తలఁచితివా! మహాత్మ!

వర్ణభేదమ్ము కీమాయ వైష్ణవమ్ము
రాష్ట్రవిచ్ఛిత్తి కీనిరర్థకసమస్య
పాదుకొల్పి మహాజనప్రళయ మిపుడ
తెచ్చిపెట్టితి వింతైనఁ దెలియవైతి.

వర్గచైతన్య మర్థింపవలయుఁ గాని
ప్రజకుబహునాయకత్వమ్ము పనికిరాదు
ప్రకృతిధర్మమ్ము సంఘసంబద్ధ మగుట
ఐకమత్యమ్మునకు దక్షు లవసరమ్ము.

జ్ఞానలవదుర్విదగ్ధు లుచ్చావచమ్ము
లగతికము లైచ్ఛికమ్ముల కంగవింతు
రాత్మసుఖదుఃఖములకు నియామకమ్ము
కట్టుబా టద్ది సడలినఁగాదుసూవె!

ఈవెఱుంగవె రేపు మ మ్మేటఁ గలిపి
పల్లెనా డేలఁదలకొన్న పార్థివుఁడవు
మల్లిదేవులపైఁ బ్రేమమధురిమమ్ము
విజ్జిరాలునె? మీమనోవీథులందు,

అనిన న్నిట్లువ్వనఁబోటుపుట్టి మనబ్రహ్మనాయఁ డిట్లాడునో
జననాథా! నృపు లీశ్వరప్రతినిధుల్ సన్మార్గదుర్మార్గర

తృణశిఖాదులకై జనింతురు ప్రజాసంక్షోభ కై క్లిత్తినన్
జన రంతఃకలహమ్ములోర్వ గటులైనన్ లోక మూఁకొట్టునే?

కొలిచితి మింతదాఁక నొఱగొడ్డెములంబడ కిన్ని నాళులున్
మెలఁగితి మెవ్వ రే మనిన మీకయి ప్రాణము లొడ్డి నెత్తుటన్
నిలచితి మింత కెంతచననీ! మనపూర్వు లొకళ్ళొకళ్ళకై
వలగొని రీవిచిత్రపరివర్తన మెన్నఁ డెఱుంగ మీక్రియన్

కొలువిచ్చిన సేవింతుము
సెల విచ్చిన నడుతు మింకఁ జెప్పెడి దేమీ?
తల దఱిగి తోఁక లదికెడు
ములుచల సేవింప నెందు ముప్పు ఘటిల్లున్.

మా కైనపరాభవమే
మీ కెట్లును దప్ప దిపుడు మీసముఖమునన్
వాకులతోఁ దీర్చిన దీక
బాఁకులతోఁ దీర్పఁ గలదుభవితవ్యమ్ముల్

ఎంగిలిపాళులఁ జెఱచిన
వెంగలిమూనుపడఁడు హద్దు వెట్టక లోలో
దొంగకుఁ దేల్గుట్టినక్రియ
రంగుం దేల్చితిరి ధర్మరాజులుగనకన్.

గోటఁ దీర్చుదాని గొడ్డంట దీర్పకు
మొదిరి చిత్తవృత్తు లెఱఁగికొనుము

వ్రేలువాఁచి వ్రమానుఱో లైనచందాన
నిప్పటికె సమస్త మెదురు నడిచె.

మొక మోట మేల రాజా!
ఇఁక నొకయొఱ రెండుకత్తు లిముడవు జేపే
ప్రకటింపవలయు మలిదే
వకుమారాగ్రణుల వంతు వచ్చిన దేదో

అని మూలముట్టుగాఁ బ
లిఁకినగొడ్డటిపెట్టులకుఁ జలించెన్ గొలు వా
తనికంటి యొఱ్ఱసెరలం
గనుఁగొని నాగమ్మబలు మొగ మ్మాయి వెలిసెన్.

నాయనిలౌకిక మేమయి
పోయిన దనువారు మంట పుట్టిన దనువా
రాయము లంటిన వనువా
రై యాసాసలను డింది రచ్చటిప్రముఖుల్.

చెంప లొరసి మెఱయుచే రెడుపుస్త్రీలు
కోరమీసములకుఁ గూర్మి నెఱప
సరభసమున లేచి సామంతరాగోలఁ
జఱచి పట్టి నాయఁ డిరవు లరసి.

అడు గడు గాత్మపౌరుషభరాలన మై గజరాజులీల ముం
దడు గిడినాఁడా? లేదా? పరిహాసవిజల్పితమై సభాస్థలం

బుడికిన దల్గురాజసుతుఁ డున్నమితౌనసుఁ డై తదారవ
మ్ముడిపెసభాప్రసన్నసమయోచితసాంత్వనముల్ వెలార్చుచున్.

కి మ్మన కాకెమూఁక నుడికించు చతండు ధనుర్విముక్త బా
ణమ్ము బలెన్ హుటాహుటిఁ జనన్ దను సాఁగఁ దలంకిద్వారదే
శమ్మున మూఁగి సాఁగిలు ప్రజన్ గమనింపక సావరాలమా
ర్గమ్మును బట్టిపోవునెడ రచ్చలు వోయినపోక లే మనన్.

పరిభవాగ్నుల కొడల్ దరికొనెఁ గాఁబోలు
గుండె నీ అయినట్లు గోడుగుడుచు
పరుషోక్తులం బాఱఁబట్టిరి గానోపు
మొగ మింత యై ముచ్చముడుఁగఁ బాఱె
రాజసమ్మున కాదరము డిందెఁ గావలె
నడు గామ డై నడ జడనువడియె
అర్ధాసన మ్మీయ కదలించినా రేమొ?
పటపట మని సారె పండ్లుగీఁటు

ముఁలుచ లున్నకడకు మునుపడి పో నేల?
పోయి పరిభవమ్ము పొంద నేల
తగిన "శాస్తి" సేసి రిఁగ బుద్ధివచ్చిన
దనుచు నుడుకుఁబోతు లడిచిపడిరి.

అంతటఁ గన్నమదా సా
ప్రాంతమునకుఁ జేర నరిగి బ్రహ్మాన్నభుజా

కుంతాయుధముం గైకొని
చెంత న్నడ తెంచె రక్తసిక్తాంగుండై.

ఆకలకల మాలించిన
దాకులపడినది వగర్చినది నెయ్యురచే
ఛీకొట్టించిన దంతం
బో కానాగమ్మ నూజిపోయం దొడఁగెన్.

తుమ్మినఁ దెగిపడుముక్కల
నెమ్మెయి భరియింతు మింత కెవ రే మనిరో?
దుమ్మెత్తి పోసి లేటము
గమ్మయి చనె నెంతగుండె గలవాఁ డౌరా?

తమ్ములభాగము చీల్చెడు
దమ్ములు గలవా! నృపాలుఁ దలపఁ డనౌచి
త్యమ్మనఁ డేరిం గైకొనఁ
దుమ్మసమున నెవరిగుండె లూటాడించున్.

చిచ్చైనఁ బిడికిలించెడి
మచ్చిది లే కున్న నింత మచ్చర మేలా?
ఇచ్చుట కిప్పించుట కీ
బిచ్చపుఁగొయ్యలను సభకుఁ బిలిపించితిరా?

అనుగురాజువంటి జననాథుఁ డీతని
మచ్చుమందు దవిలి మడిసె నంద్రు

కన్నతండ్రి మరణకారకుఁ డని సైత
మూరు నాడు నేఁటి కుడికిపోవు.

ఈదుష్ప్రచారమునకుఁ బు
నాదియె నే ననుచుఁ బల్లెనాటిగెళవులం
దూదరపెట్టి నిరంతర
మేదో కల్పించు నాతఁ డత్తినభీతిన్.

ఏపెలు గదలునె? యీాయుడ
తూపులకును నాఁడుదానియుసురు దగులదే?
లోపాలోపము లెఱుఁగక
పాపాచరణముల కిట్లు పాల్పడునెడలన్.

ఆఁడుది గద్దెక్కినఁ దన
నాడులు దెగ నేల! యంత నానగలాఁడీ
యూడిగమున కెటుపాల్పడి
నాఁడో? చెపుఁ డింతకన్న నగుబా టున్నే?

పతియాజ్ఞ దక్కి నడిచిన
బ్రతుకఁటె? చెలరేఁగి కొల్వుపట్టున నతఁడీ
గతిఁ దెగనాడి చనె న్మన
క్షితిపతి సైరించు టేమి చిత్రమొ తెలియన్.

మంత్రాంగపరు లొనర్చు కు
తంత్రము లరికట్టవలయుఁ దా రటు గామిన్

మంత్రు లాకానొకవేళ స్వ
తంత్రత వాటించి చెఱపఁ దలఁచెద రధిపా!

కావునఁ బ్రభువు ప్రజ్ఞాచక్షువైన
షడ్గుణవిషయైకచతురాస్యుఁ డైన
మంత్రుల శాసించిమసలరా దెపుడు
మసలినఁ గామక కసిమసంగెదరు.
అగుట సర్వాంగీణముగ రాచవారు
సత్కులసంజాతు శాస్త్రనిష్ణాతు
ప్రజ్ఞాసమన్వితుఁ బ్రభుభక్తియుక్తు
ధర్మగుణాసన్ను ధైర్యసంపన్ను
సచ్ఛీలవంతుఁ బ్రజాహితస్వాంతుఁ
బ్రెగ్గడగాఁ జేరఁబిల్చి మన్నించి
పట్టముగట్టుట ప్రథమపక్షమ్ము
తరతరమ్ములవానిఁ దరిజేర్పఁదగదు
చనవునఁ దాన రాచఱికమ్ము నెఱపు
సహపాఠితోఁ బొత్తు చన దేరికేని
మన్ననసెడి రాజమర్యాద లుడుగుఁ
గ్రొత్తవారిం గూర్చుకొను టుత్తమమ్ము
నయభయమ్ములఁ బాలసమ్ము సాగింత్రు
సరివారి నెందు నొప్పరికింపవలయు
మంచిచెడ్డల నుపేక్షించి కైకొనరు
ప్రాణ మర్పించిన బాలిశు ల్దగరు

బుద్ధిజాడ్యవికారములకు లోఁగెదరు
సర్వలక్షణయుతుల్ సచివాగ్రగణ్యు
లేనూటి కొకఁడున్న నిట్టిక్రోధను లె
గర్వగంధాంధ్యులై కాలుద్రువ్వెదరు
విద్రోహముల కంగవించి తీఱెదరు.
కత మెఱుంగం డహంకారపూరితుఁడు
అధికారమదమత్తుఁ డైన నింకేమి?
నమ్మినదొరలకో లెమ్ములం గొఱికి
ఎల్లఁపిమూఁకల కిలుద్రవ్వి పెట్టు
సరివారి నింతైన దరిఁజేరనీక
తలఁదన్నువారి మెప్పులకుఁ దారాడుఁ
దనదోషముగ్గడించినఁ దారసిల్లి
పరనిందలకు జబ్బచఱిచి మున్నాఁడు
స్వార్థమ్ము దక్కఁ బరార్థ మూఁకొనక
ఎల్లవెంటలకు అంపిల్లి కాఱాడుఁ
బతనమ్ము దప్ప దాపాపచిత్తునకు
అపకీర్తి తలఁగదా యధమాధమునకు
నాలుక చీల్చిన న్యాయమ్ము లేని
గుండె పెకల్చినఁ గూర్మి చొప్పడని
కనుగ్రుడ్లు తోడిన నెన రుప్పతిలని
ఈర్ష్యాగ్రహావిష్టుఁ డెం డైనఁ గాని
తానని యంతయై తలమీఱి నడచు

ధర్మపు దప్పి పథ్యమ్ములన్ గడచు
ఈచెయ్దముల కీతఁ డేనిదర్శనము
నేను విద్యావతి నైనకారణమొ?
పాలివాని సంపదన్ దులఁదూఁగుకతమొ?
ప్రాభవ మొక్కింతవడసి నందులకొ?
నాయనికనుగుట్టె నలగామరాజ!
ఏనొనర్చినతప్పు లెఱుఁగరా? మీరు
తమకె సర్వస్వమ్ము ధారవోసితిని
తలఱాయిచేసుక కొలువ వచ్చితిని
ఈభాగ్యమున కాతఁ డీరస మ్మెత్తి
ఒడ్డోలగమ్మున నుడికి పోనేల!
తగవరిచందానఁ దెగనాడ నేల?
వీఱిఁడివడువున వేంచేయ నేల?
మంత్రు లీక్రియ రాజమర్యాద లెడలి
పరువుమాలిననాఁడు ప్రజలు గైకొనరు
సచివు లుత్తము లైన సామ్రాజ్య మెల్ల
ప్రథితాంగదృఢసంధిబంధ మై వెలయు.
అటుగాక తక్కిన నఖిలరాజ్యమ్ము
మూలమట్టమ్ముతోఁ గూలు నింతేల?
శ్రీవారె చిత్తగించెదరు పోనిండు
అన్నఁ గిమ్మన్నవా రందుఁ గప్పడరు.

మువలభీముఁ డంత ములుగుచుఁ బఱతెంచి
కొలుకు లెడలునీరు గ్రుక్కుకొనియె
అమితరక్తసిక్త మంగమ్ము దిలకించి
వెచ్చనూర్చి కొల్వు ఱిచ్చపడియె.

నాయురా ల్వసిపట్టి మిన్నాగువోలె
అద నెఱిఁగి రమ్ముపొమ్మని యదరవ్రేసె
అంతరార్థావగాహి వాఁ డపసరిల్లెఁ
బ్రక్కప్రక్కల గుసగుసల్ బయలుదేఱె

అపు డెటుపాలుపోక నృపుఁడాత్మ నలందురిపల్కె నన్నిటన్
నిపుణుఁడె బ్రహ్మనాయఁ డవినీతిబలెం బరు లెగ్గు లాడిరన్
నెపమునఁ గొల్వు వీడిచనునే? మము సైతము లక్ష్యపెట్టఁడే
య్యపరిమితాగ్రహ మ్మెవరి కైన ననర్థక మావహించెడున్.

నాయకురాలి కిందను కనారతవైరము లారఁగూరినన్
మాయెడ నేమివచ్చె ననుమానము గాక తనంత దానిటుల్
పాయునె? యాదినుండితమవారికి మే మయి మాకుఁ దారునై
పోయినపోకడల్ మఱచిపోయెడివే తను వున్నమట్టుకున్

మాయోగక్షేమమునకు
నాయనిబలె నేఁటిదనుక నాయకురాలున్
నేయము తీయము లెసఁగన్
శ్రేయము లొడగూర్చి మెప్పుసేయని దున్నే?

ఏ రిరువు రొకటితలమై
తీరుందీయముల మమ్ము దిద్దినఁ బలనా
డీరాష్ట్రికూటములలో
మాఅటస్వర్గమ్ముగాదె మరునిముసముసక్ !

ఈకలఁత లెసఁగి తుదకుక్
బోకాడెద రంచు బీతువొడమెడు నిందా
వ్యాకులజీవితమును నెం
దాఁకక భరియింతు మిది వృథావ్యథగాదే?

ఐనను జెప్పిచూతు వినయమ్ము నయమ్ము భయమ్ము దోప వి
జ్ఞానధనుం డతండు వినఁగా ననఁగా మనఁగా సమర్థుఁడం
చానలగాముఁ డోలగము నాపి చనె న్నరసింగరాజుతో
డ్తో నరుదేర సభ్యులనధోముఖుఁడై పథి పీడుకొల్పుచుక్.

ఆరాజేంద్రుఁడు చన్నపిమ్మట మదవ్యాళి మ్మధిష్ఠించి స
ర్దారుల్ జెబ్బదిమంది తోడఁజనుదేర న్నాయఁ డేతెంచు బా
జారెకెక్ మననాగసాని యిదిమాత్సర్యప్రభావమ్ము నాఁ
డారమ్యాకృతి కైననేత్రముల భాగ్యం బెన్న సామాన్యమా?

# నాయకురాలు

## అష్టమఖండము

ఛాయనచాయవాఁ డొకనిషాదుఁడు బాణధనుర్ధరుండు పె
న్నాములు దాఁటి తచ్ఛరవణస్థలి మీఁదుగ సాగి నాగభా
మామణిభూగృహాగ్రబిలమార్గము సొచ్చి తదీయకల్పనా
శ్రీమహితప్రమోదభరచిత్త మెలర్చి చెమర్చి నిల్చెన్

ఎవరదిగుండయ్యా యని
"నవరంగి" యొకర్తు చీరిన న్వాని యాతం
డవు నవు ననిన న్నవలా
యవసర మెఱిఁగించి పుచ్చె నవలి కతండున్.

మైనపుఁదీపము లార్చెడు
క్రీనీడలఁ గడచి నొసటఁ గే ల్గదియింపన్
బానుపు డిగి నాయకురా
లానందఘు వెనక మెసఁగ నాతని కనియెన్.

ఈనిషాదవేష మెటు లబ్బెనో గాని
బోయజాతిఁ జంపి పుట్టినావు
దండకడెము, జంపు, తాయెతుల్, మురుగులు
దోసకా డదెట్లు దొరకె నోయి?

గుండన్న

పలినహరిజనమ్మున
కేలోపము జరుగ దానతీవలెఁ గానీ
రేలుం బవళ్లై పవలుఁ
రే లయి జోహారు లాచరింపవఁటమ్మా!

నాయకురాలు

ఔనౌను మఱచితిమి మా
ప్రాణములఁ బ్రాణ మార్యపాదులు సుఖులే?
జ్ఞానానందుఁడు కొమ్మన
సేనై శైవులకుఁ గూర్చునే? నిరతమ్మున్.

బుద్ధరాజు నీచబౌద్ధసన్యాసుల
కూడిగ మ్మొనర్చుచున్నవాఁడె?
పూజనీయుఁ డైనరాజేంద్రచోడుఁడే
పరమనాస్తికున కుపాస్తి నెఱపె.

అటు బౌద్ధ మ్మిటు శైవ
మ్మటునిటు వైష్ణవము కొంపలార్పఁ దొడంగెన్
కుటిలమతు లెంత కెత్తెద
రటవృత్తాంతమ్ము దెల్పు మాద్యంతమ్మున్.

గుండన

తెలుపుట కేమిక ద్దెపుడో తీఱె సమస్తము చందవోలునం
దలజడి పుట్టె భిక్షుకులకైన దెఱుంగరు శైవు లోర్వమై
నిలిచిరి బుద్ధరా జిపుడు నిప్పులు గ్రక్కుచు నున్నవాఁడు రా
జలబల మాపలేక యమయాతనపా లయి గోలకెత్తెడున్

ఏమది గుండయ్యా! మన
స్వాములు శివయోగు లెందుఁ జని రన వినవూ
నామాలపోతుమాయకు
భూములె బుగ్గైన వీరిపుట మాఱదో కో?

మీయాజ్ఞమేరకు సాయాహ్నమున కెట్లో
శ్రీవారు చందవో ల్చేరినారు
కొమ్మనప్రభృతులు కొందఱు శివభక్తు
లెదురుకో ల్పచరించి రది యెఱింగి
బుద్ధరా జుగ్రుఁడై బౌద్ధపదాచార్యుఁ
బిలిపించి కలహమ్ము పెంచినాఁడు

వాదోపవాదముల్ వారియుక్తిప్రయు
క్తులతోఁ బ్రవర్తిల్లెఁ గొన్నినాళ్ళు
మచ్చరము లంతకంతకుఁ బెచ్చుఁగల్గి
ఇరుతెగలవారికి౯ శివ మెక్కిపోయెఁ
బాదుప్రాణాలు గుప్పిటఁ బట్టుకొంటి
మేమి సెప్పుదు మప్పటి తామసములు

ఉభయకక్ష్య లిట్టు లుడుకుచున్నెడ మేము
శక్తిపూజనములు జరుపు టెఱిఁగి
బౌద్ధగురుఁ డొకండ శౌద్ధోదని భజింపఁ
జైత్రమునకు నర్ధరాత్రమరిగె

ఎవరికి మూఁడెనో? తెలియ దీశ్వరనిర్ణయ మిట్టులున్నదో?
ధవళశిరోఽగ్రభాగము నదాటున వ్రేసిన నొడ్డుపొడ్వన౯
భువిఁబడి ప్రాణముల్ దొరఁగెఁ బూర్వవిరోధములుంటఁ జేసి భూ
ధవుఁడు విచారదూరుఁడయి ధర్మవిరుద్ధముగా గురూత్తము౯

కొలువున కామతించి కనుగ్రుడ్లెదుట౯ దులిపించె నచ్చట౯
నిలిచి సభ౯ గిభ౯ బరిగణింపక శ్రీగురుదేవుఁ డుగ్రుఁడై
పలికినపలుకుల౯ వినుసభాసదు లీవిపులాంధ్రమండలీ
ప్రళయము రాక తప్పదని భావముల౯ దలపోసి రంతట౯

నెత్తురు దోయిలించి ధరణీపతిముందఱఁ జల్లి చోడరా
జోత్తమ! నీ భుజించురుచిరోదన మాఱనిచీము నెత్తుర౯

జాత్రిలి పుద్వ్వలుంబడి యశుద్ధ మాగున్ జుమి యంచుఁ దామసో
ద్వృత్తిఁ జనెన్ మమున్నిలువరించి గురుండెటకో హఠాత్తుగన్
మము నెమకింప భూధవ్రుఁడు మంత్రుల కాజ్ఞ యొసంగ నీక్రియన్
శ్రమపడి వచ్చినాము "గురురాయఁడు" శ్రీగిరి సేరె నందురా
సమయమునందు నాయని ప్రచారకు లచ్చుటఁ గానిపించి ర
య్యమభటు లీ సురంతముల కైరని విందు యథార్థ మెట్టిదో.

నాయకురాలు

అనుమానింతు వదేల? నిక్కముగ బ్రహ్మనాయఁ డామాలపో
తునుబంపించి రహస్యమార్గమున బౌద్ధున్ గీటడంచెన్ బ్రయో
జన మీ వేమియెఱింగె దిట్టయిన దోషమ్మెల్ల మీమీఁదుగాఁ
జను బౌద్ధ మ్మణగారు వైష్ణవము రాజ్యమ్ములు సల్వంకలన్.

మఱఁదిన్ గాదని రాజచోళుఁ డెవరిన్ మన్నించు బ్రహ్మన్న కై
క అదల్ ద్రవ్వఁడె? బుద్ధరా జొడుపుదొంగల్ మూఁపురిల్లైతమై
పరరాజ్యమ్ములు పంచుకోఁ దలఁచి రీపాపమ్ము గావించిరీ
శ్వరుఁ డున్నాఁడని ముట్టిపల్కరదరే? వాంఛావైపరీత్యమ్ముగన్.

ఒక బ్రహ్మణ్యుని నేత్రముల్ దులిచి రేదో మాటకున్ రాక పో
దిఁక వారీ విపరీతగాథలకుఁ గారే తొత్తుకుం దొత్తులై
మకుటాలంకృతు లైనసుర్మతుల ధర్మమ్మెడ్చి నట్లున్న దూ
రక గాదెత్తునఁ గొంపు నంచు బహుధా అంపిల్లెఁ గంపించుచున్

ఆనడు రేయి మంచుతెరలం దివ మెకి౯నపైరగాడుపుల్
పై నసియాడ వారువముపై యువరా జరుదెంచి వారలన్
బైన మొనర్చి తాను నరపాలగృహా మ్మొడసొచ్చి నేరుగా
లోనికిఁ జేరె వారు త్రుటిలో వెనుకం జనుదెంచి రల్లనన్

నృపుఁడరగంట వారిఁ గరుణించి యితం డెవఁడన్న నాయురా
ల్విపులముగా విచిత్రముగ విన్చెఁ దదీయచరిత్ర మాతఁడీ
నెపమున బౌద్ధపండితుని నెత్తురుగాథలు ద్రవ్విపోసె రా
జపరిమితా ర్తిఁ గూరి మొగ మవ్వలి కించుక ద్రిప్పెఁ ద్రిప్పినన్

నాయకురా లదల్చి తగునా ? వగవన్ జననాథ ! వైష్ణవుం
డాయువృప క్లిజెంగి తగి నట్లొనరించె జగమ్ము కోడియై
కూయుట లేదె యాఁడు దనఁగూడదు గాని గురూత్తముండు శా
పాయుధుఁ డట్టివానిపని యైనది మాపస పట్టుకుండునే ?

నలగామరాజు

ఇరుదెగ లుప్పరించి కలహించిన భూపతి కాత్మశాంతి చే
కురునె? యొక ల్లొక శ్శ్యడఁచికొన్న సహించు నృపాలుఁ జెట్టలన్
బఱతు రెబైన నాకుఁ దలబట్టిన దీపరిపాలనమ్ము మీ
వెరవున నిశ్చయింపుఁ డన వెల్వలఁ బోయిరి మూవు రావలన్

నాగసానికొంత నాటక మ్మాడిన
దొప్పుకొనక పెనఁగె నొడయఁ డంత

మీావినిర్ణయమ్మె మేకొందు మన నాతఁ
డొనరుపడువిధాన ముగ్గడించె

ప్రజలయందు భేదభావమ్ము లెసకొనె
ఇంటిగుట్టు రచ్చ కెక్కఁ దొడఁగెఁ
బ్రతిపదమున నురక మతకక్ష లేర్పడె
ఇంగితజ్ఞు లొప్పరింపఁ దగునె?

ఎదు రేచినఁ దుది మండెడి
చదుగులు మా కింప విట్టి చందమ్ములతో
నొదుగదు రాజ్యము గావున
నదియే నొకపనుగు వట్టుటే యుచితమగున్.

ఇరువురు సమర్థు లొక్కచో నిముడఁ గలరె?
వీరివారిప్రవృత్తులే వేరు వేరు
నాయనిదొలంచు టతిశుభదాయకమ్ము
దీని కీమార్గమునఁ బ్రవర్తించు టురవు.

సిరిగిరిందొట్టి కొంతమా* చెర్లసీమ
చిన్నతమ్ములు కిదలంచితిని గాన
నాయనికి సైత మిది మోదదాయకమ్మె
తాను సచివాగ్రగణ్యుఁడై తరలవచ్చు.

---

* ఎత్వమధ్యమును గలదు.

నాయురాలి కపుడు నఖశిఖపర్యంత
మినుపకోలఁ గాఁడనేసి నట్టు
లగ్ని బొరలి నట్టు లాముదిన్నట్లయి
రెచ్చిపోయి దులబరించి పలికె.

భారభుగ్న ఫణీంద్ర ధారుణీవలయమా?
పలనాటి కస లీ విభాగమేల?
వెలనాటిరాజేంద్రవిశ్వాసపాత్రులై
పడసినస్వాతంత్ర్యముడుగ నేల?
శక్తిత్రయవిహీనసాధనోన్మనులైన
దుర్బలులకు నిల్వ్వదోఁపి డేల ?
భవదీయరాజ్యవిప్లవకారకుం డైన
బ్రహ్మబంధువున కీపదవి యేల ?

కార్యఖడ్గములకుఁ గలవారు మనవారు
దాంభికాధములకుఁ దలఁక నేల ?
కాళ్ళబేరమైనఁ గరుణింతు రుర కిట్లు
త్రవ్వి పెట్టువారు ధరణిఁ గలరె ?

ధవళశంఖుఁడు నాఁడు మీతల్లి పేర
నరణ మిచ్చిన పల్లెనా డనుభవింప
మల్లిదేవుల కేక్రియ వల్లపడును ?
మీరు వారు సగర్భ్యులా? మేదినీశ ?

పలనాటిని విభజించిన
వెలనాటివిభుండు మిమ్ము వెంపరలాడున్
మలిదేవభూపతుల గూ
బలు పిండి నిజమ్ము బట్టబయ లొనరించున్.

వారు మిన్నకున్న వాల్లభ్యమదమునఁ
జుట్టుపట్టు లఱుమఁ జూతు రందు
బ్రహ్మదేవు నింకఁ బట్టఁ బగ్గాలుండ
వెఱఁగి యెఱఁగి వింతపరుగు లేల ?

కొమ్మరా జొకింత కూర్చువాఁ డైనను
తోడఁబుట్టుమగనితోఁ జెలంగు
అతనిసుతుఁడు మీకు నల్లుగుఱ్ఱం డైనఁ
దండ్రి ననుసరించి తమ్ముఁ జేరు

వీ రంద ఱొక్కఁడై మన
పేరూరు న్మాపి పిల్లపిల్లతరముగా
వీరికి వారై వారికి
వీరై పలనాటి ననుభవించెద రధిపా ?

అయిన గులకరించు టది మాత్రము హుళక్కి
మన్ను మిన్నుఁ గలిపి మట్టగింతు
మనసు పేద మాట మార్దవ మిది రాచ
వారి కుండఁదగిన తీరుగాదు.

దేవరవారికిఁ గల తెఱఁ
గావేదించితి యథార్థ మరసికొనుఁడు మ
ద్దేవాదులకున్ గూర్చుఁడు
మావలవని సంగతులకు మలికిత మేలా ?

అనుపలుకు లందుకొని వి
న్ననువున నరసింగరాజు నలగాముని కి
ట్లను నో ప్రియసోదర! మీ
కనుసన్నల మెలఁగు మాకుఁ గడవని దున్నే!

ఐన వచింతు సోదరులకై సగపాలని యేమి? మంచి కెం
త్తైనఁ దెగింతు రగ్రజుల నాటడి పుచ్చి తదన్యపక్షముల్
పూనిచరించు ద్రోహులకు భూములు గీములు పంచి వారికిన్
బానిసలై కృశించుజనపాలురవృత్తము లింత క్రొత్తలే ?

జననాథా! వినుమొక్కసంగతి రహస్యప్రేరణ మ్మేల! మే
మును మద్దేవులతోడివారమె కదా? మోమోటమునం దక్కి పం
చినచో నెన్మిదిభాగము ల్వలయునే చేజారిపోరా దెఱిం
గిన మీవంటిసమర్థు లించుకయినన్ గీడెంచి మే లెంచరా ?

“తమ”కేనియు జ్యేష్ఠాను
క్రమమున నిది సంక్రమించెఁ గ్రమ్మఱి త్వదప
త్యమునకుఁ జెల్లున్ మీ కిది
భ్రమమో బ్రహ్మన్నవలనిభయమో తెలియన్

నాయనికి జంకి వారికి
నాయకురాలికిఁ దలంకి నాబోంట్లకు మీ
దాయము లెంతని పంతురు
ప్రాయికభోగముల కీవిభాగము లేలా ?

మీకు విధేయులమై పర
లోక భయంకరులమై ప్రలోభ ముడిగి సౌ
ఖ్యైకలనమ్మునఁ దేరక
లోకము లటు లూల మూల గుడిచినఁ బడునే ?

మలిదేవు లశక్తులు తగు
కొలఁదిన్ రాజ్యమ్ము దిద్దుకొనఁ జాల రిఁకన్
బలనాటి కృష్ణుఁ డెడపెడ
వెలిఁగించుం జుట్టుపట్ల వెంబరవిత్తై.

కార్యదక్షురాలు కపటభేదకురాలు
కొన్నహక్కు లడఁచికొన్న దనుక
రేకమోవనీదు రేవునఁ బడనీదు
నీరుద్రావనీదు నిదురవోదు.

కావున బ్రహ్మనాయని
దేవరవా రిచటనుండి తెరలిచిరా ? మ
ద్దేవులకావర మణఁగున్
దేవతలకుఁ దలఁక మెంత దెప్పరమైనన్.

మాటవరుస దవిలి మాభాగ మంటిని
పటికరింపవలదు బాధవలదు
మీ పదార్చకుల సమేలంపుమాటల
నొవ్వదీర్చుఁ డంచు నొడివెనంత.

నలగామరాజు

మిముఁగడవం దలంకెద సమీప్సితసిద్ధికి దండనీతికిన్
సమయముగాదు శాత్రవు లెసంగిరి మీ హృదయమ్ము లర్థమై
కుమిలెద నేమిసేయుదు నఘోరపరిస్థితు లాత్మదార్ఢ్యమున్
నమలిన వింతకన్న మరణ మ్ముచిత మ్మనిపించుఁ దమ్ముఁడా!

నాతరువాతివాఁడ వయిన న్ననుదిద్దుచు మెప్పుఁగూరుచుం
భ్రాతవు పల్లెనాటి యువరాజవు నీ వొరునట్లు సంశయ
స్థితుఁడవైన మే మయి వచించెడిదేమి? కుటుంబవైరని
ర్యాతన చేతగాక సగమైనఁ ద్యజింపఁ దలంచితిన్ దుదిన్.

నాయని గొల్చి తమ్ములు మనఃపరితాపము గూర్చి రంతటన్
బాయక విప్లవమ్ములకుఁ బాల్పడి రందుకతమ్మునన్ బహు
ప్రాయులు పెచ్చురిల్లి రటు వా రిటు మీ రదిగాఁ బ్రజల్ నను
స్నాయువు లుచ్చిపోవఁ బరుషమ్ములు వల్కెద రల్కపెంపునన్.

ప్రజ కనురక్తిగొల్పని నృపాలకుఁ డెందు కనంతకోటిది
గ్విజయము లెందు కర్థమదవిస్తృతభోగము లెందు కిందుచే

వృజినము సంభవించు భుజవిక్రమ మాఱడిపోవు సత్కళా
భజనమొ? పూజ్యపూజనమొ? ప్రాజ్ఞులచిత్తప్రశాంతికేర్పడున్.

సజ్జనులైనవా రపయశంబున కోర్వరు కీర్తిదూరు లీ
పజ్జకు రారు త్యాగ మిటు స్వార్థ మదై కనుమూతు రింత కా
విజ్జలదేవి పుత్రకులపీపున మూఁపున వెల్గునాయకుం
డొజ్జలపుచ్చకాయ యెటు లోర్తురు వానిని నిశ్చయింపుఁడీ?

ఆతని కల్గినన్ మనకనర్థమువాటిలుఁ జిత్తశాంతికీ
రీతిప్రశంసనీయ మురరీకృతి కెంతయు మెత్తు లేనిచో
భూతల మిప్పుఁడే విడిచిపుచ్చెద సోదరులెల్లఁ గూడి సం
ప్రీతిగ నేలుకొం డనినఁ బెద్ద తపించి నృసింహుఁ డిట్లనున్,

పూజ్యపాదు లాకరిపో పాసపడ నేల?
పుడమికాలఁ దన్ని పోవ నేల?
అర్థభాగ మెందుకఖిలరాజ్య మ్మిందు
మీకు లేని దుర్గ మా కదేల?

ఇంతసేతు రీర లీసడింతురు వార
లబ్బినంత లప్పు నప్పళింతు
రవల నెత్తివత్తు రాసాంత మూడ్తురు
కినుక దక్క చిత్తగింప వలయు

## నాయకురాలు

జొనవు నట్టివాఁడ సుతుఁ డన్న గణింపక చంపఁ బంచెనీ
దానవుఁ డాతనిన్ దవిలితమ్ములు పూర్తిగ మారి పోయిరీ
మానవనాథుచిత్త మనుమానవిహీనము గాన వీని నె
ట్లైనఁ బరాభవింపవలె నంతటఁ జక్కపడున్ సమస్తమున్.

అన్నలు తమ్ము లన్న విషయ మ్మది వేరు ప్రభుత్వగౌరవ
మ్మన్నది వేఱు రాజులు భయంపడి ద్వేషికి లంచమిచ్చినన్
వన్నెకు వత్తురే? పరులపా ల్పటులుంచుఁడు చుట్టపక్కముల్
మన్నన సేతురే? తనసమానమహీపతు లాత్మమెత్తురే?

అనుచిత మంచు తేవయిన నాత్మఁ దపింతురుముట్టిపల్కెదన్
వినుఁ డిటుమల్లిదేవులకు వీసముగా దరవీస మంత ద
క్కునె మునిగోటఁ దీరునది గొడ్డటఁదీర్పఁ దలంచినారు నా
తనువునఁ బ్రాణ మున్నెడ వధల్ వ్యథలున్గథలై క్రమింపవా?

అబలనని సంశయింపకుఁ డాజ్ఞసేయుఁ
డనుచరులతోడ నాయనిఁ బెనఁచి తెత్తుఁ
గడచినన్ దిద్దుకొనుపెంత కానిమాట
ప్రముగ్గుపైనఁ బ్రతిష్ఠకుఁ దగ్గఁ జనదు.

చెప్పఁగలవట్టు చెప్పితిఁ
దప్పనిసరి యన్న మీావృథామాధురి మా
కొప్పదని లేచి వెడలెన్
జప్పున నటువాసి గూఢచారునితోడన్.

## నలగామరాజు

ఏమా కోపాటోపము
మో మెఱ్ఱులు ద్రోలి నిప్పుముద్దైనది బ్ర
హ్మామాత్యునిపే రెత్తిన
నీమెయొడల్ మండి యార్చు నెత్తిన కినుకన్.

ఇటువోక తగునె? నామది
కటకటఁబడెఁ జేయివెట్టి కలఁచిన మాడ్కిన్
పుటమాఱితీరు నన్న
ట్లెటులైనన్ శత్రుపక్ష మీబిడకతనన్.

ఆడినది తప్ప సర్వము
పాడఱినన్ నాగసాని ప్రతిబంధము లే
జాడఁ దొలంతువొ నాదెస
నోడకు మని మాటిమాటి కొత్తిపలికినన్.

## నరసింగరాజు

పట్టినపట్టు నెగ్గుటకుఁ బ్రాణము లొడ్డి తదన్యపక్షముఁ
గొట్టదు త్రాఁచుపాము పగకుం బదిరె ట్లధికమ్ముగాఁ బగం
బట్టు నెదుర్చువైరిపసఁ బట్టుఁ బ్రపన్నులఁ జేరఁబట్టు ని
ట్టట్టన వచ్చునే? పరులకైనఁ దదద్భుత సాహసిక్యముల్.

మనవిభవాభివృద్ధి కగుమార్గము లారయుఁ గాని సుంతయున్
జెనకఁ దలంప దీశ్వరుఁడు సెప్పిన నాయనిఁ దద్బలమ్ములన్
బనుపడ నీదు మీకనుభవమ్మొకదా యిటువంటివారిఁ గా
దని మనకల్గువారి కొఱకై పరువెత్తినఁ బర్వదక్కునే ?

బ్రహ్మనాయుఁడు మలిదేవ పక్షపాతి
గుండె లఱచేత నిడినఁ గైకొనఁడు వినఁడు
మిమ్ముఁ గెడపి సమస్తరాజ్యమ్ము తుదకుఁ
బెద్దమలిదేవునకుఁ గట్టఁబెట్టఁ దలఁచె.

అతనిచరిత్ర మిప్పటి కంతుపట్ట
దబ్బకే విష మిచ్చినాఁ డాత్మజుండు
దుష్టనక్షత్రసంజనితుం డఁటంచుఁ
జంపఁబంచె నతం డసల్ శ్వపచుఁడన్న!

అనదలకురాజ్యభాగసమర్పణమ్ము
ఆత్మదౌర్బల్యసూచక మ్మదియుఁ గాక
చివర కాసచివాయత్తసిద్ధు లూళ్లు
లెత్తికొని మీక యపకీర్తిఁ దెత్తు రధిప!

పులినోరికండకై బా
రలుసాఁచితి మీఁదనుక నిరర్థకమయ్యెన్
పలనాటిరాజ్యలక్ష్మిని
నిలుపునఁ జీల్చినఁ దొలంగునే మీబాధల్.

కృతనిశ్చయులై మహిష్మ
స్థితిగతు లడుగం బనేమి సెలవిం డని స
మ్మతివడసి చనిరొ యువరా
జితనిమహోవైమనస్య మే మనువాఁడన్.

ఆజాలిచూపు లత్యంతదుఃఖమరీచి
కాలోలపంక్తుల నోలలాడు
ఆజాలిగుండె లుద్వృద్ధయాంబోధివి
చారవీచికలలో జలకమాడు.
ఆవింతకోరిక లభిమానముద్రాని
గూఢభావద్యుతిం గొల్లలాడు
ఆవేఁడినిట్టూర్పు లాత్మనై రాశ్యక
వోష్ణదీధితుల నుబ్జాఁతలూఁగు

భావశబలత భూపతి పట్ల నాఁడు
చిత్రరూపములం బ్రదర్శింపఁ దొడఁగె
ఆవినశ్వరవిప్లవజీవిత మ్మ
సహ్యమనిపించి చింతిల్ల సాగెనతఁడు.

ఎంతో పాప మొనర్చిన
జంతువఁ గాకున్న నిట్లు జన్మింతునె రా
జ్యాంతే నరకం ధ్రువమను
టంతమునం గాదు నేఁడ యవగత మయ్యెన్

సర్వశక్తియుతుఁడ స్వాతంత్ర్యహీనుఁడఁ
బాలకుఁడనా ? లేక పాలితుఁడనా ?
నాచరిత్ర నాకె నవ్వొదఁగూర్చెడుఁ
బాలఁతిఁ జేతి కీలుబొమ్మ నైతి

రెండంచుల కత్తులు నా
గుండెల కిరుగడలఁ బాదుకొన్నవి నేసి
ట్లుండియుఁ బైకీశత్వా
దండము ధరియించి యస్వతంత్రుఁడ నైతిన్.

ఈరాజ చిహ్నములు కడు
భారములై క్రుంగి నరకబాధలపాలై
భీరుప్రక్రియ నానాఁటికిఁ
పౌరుష మఱి బ్రదుకవలసె భ్రాతలకతనన్.

ఇంత కీనాఁటి కాత్మవిశ్రాంతి లేదు
కడ కొకింతేని దేహసౌఖ్యమ్ము లేదు
ప్రజకు మామూలు రాజగౌరవము లేదు
బ్రతికి ఫలమేమి నను వంటి పార్థివునకు.

ఈనిరర్థకజీవిత మేండ్లు పూండ్లు
సీడ్చి కుమిలి కృశించి నశించుకంటె
విమలకృష్ణాతరంగగర్భమున కుఱికి
పరమపదసంప్రమోదమ్ము వడయువాఁడ.

అనుకొనుచుం గనుమూసెఁ
జననాథుఁ డదేమొ? వానిస్వప్నములోనఁ
బెనుభూతమ్ములు నెత్తురి
పునుకల నోలాడి నట్లపుడ పొడకట్టెఁ.

మలయభూధరపవమానమానహరము
వారిజాకరధీరసమీర మొలసి
చలువలెగఁజోసి సౌరభ మొలుకఁజోసి
వింతసంస్పర్శసౌఖ్యమా విహరించె.

# నాయకురాలు

## నవమఖండము

మాన వేంద్రుని పూర్వవాగ్దాన మపుడు
గుప్తి కెలయించి ముద్రగై కొన్న దబల
పల్లెనా డేడుగడెలలో గుల్లసేసి
అంగబల మర్థబల మెట్టు లలవరించు?

మన్నీ లాఢ్యులు తమతమ
సన్నదులం బొంది గుట్టుచక్కఁగ లోలో
మన్ను దిను పెంజరలబలె
నున్నా రని పాలుపోవ కుడుకాటమున్.

వట్టిముద్రల దస్త్రర మ్ముట్టిపడఁగ
జిట్టగామాలపాడు వేంచేసె నామె
పాముకొను నయ్యా లెందఱో బైసిమాలి
దేబెరించుటకై బయల్దేరి రందు.

ముందు సాగిపోవు మంతసాని కొమ్మన్న
మంచనాడు లాలకించుచుండ
నాగసాని కథలు నాయని బోధింప
నృపతి బాధ లుగ్గడించినాఁడు.

నాగులేటిపట్టు నడతెంచు వారికి
మంచుతెరలఁ బాండిమమ్ము దోఁచ
బాలభానుఁ డుదయపర్వత శిఖరాగ్ర
భాగ మెడలి మింటఁ బయన మయ్యె.

ఆ మిహిర మండలాతప
శ్రీమహి మోజ్జ్వలము లాగ్రసిద్ధనదీగ
ర్భామృత సేవన పావన
భూములు దిలకించి పొంగిపోయిరి ప్రణిధుల్.

చిలుకపచ్చల కోడల్ సేసి సుం కెడలించు
పచ్చిపాలుబ్బుకుఁ బొడ్డుపులిసి
బెడఁగారు కాపుగుబ్బెతల పల్లెపదాల
వింతధోరణులకు వీను లలరి
పసిపూవు లసియాడు పచ్చికజలతారు
గొలుసులకుం గనుల్ గోరగించి
అలరుపుప్పొడితావు లోలయు తేగానుపు
టూయేల పరువుల కోడలు పుటుచి

అడు గడుగునందుఁ దన్మయులై కరంగి
దేవమాతృకముల సన్నుతించినారు
ప్రకృతి కొకరూప మొడఁగూర్చు పంటపలఁతి
బడలికలు వాపి సేవించెఁ బాంథజనుల.

ఈపంట భూములందే గుంటివెట్టించి
పెద్దన్న బండ లీడ్పించినాఁడు
ఈవెలినాములందే మాలకన్నండు
వీరశైవుల బందెవెట్టినాఁడు
ఈనదీ తీర్థమందే బ్రహ్మనాయండు
యోగమాయా భ్రాంతు లుడిగినాఁడు
ఈశాద్వలములయందే రెడ్డినాగమ్మ
మేపడి మందాల మేపుకొన్న

దీబయళ్ళు చరిత్రల కెక్కు నెడలఁ
దాటుమాటుగ గాథలఁ ద్రవ్విపోతు
రనుకొనుచు నారికేళవుల నందికొనిరి
అందుఁ గొందఱు మిట్టమధ్యాహ్నమునకు.

అచటికిఁ గానిపించు నొకహార్మ్యము భూతలవైజయంత మం
దచకితదృష్టులై ప్రణిధులల్లనఁ జేరివిస్ఫుర న్మణీ
ఖచితకవాటగోపురము ఖప్రకటీ కృతకాలనిర్ణయ
ప్రచురణముల్ పఠించిరి పరస్పర మాశ్రుతు లైరి పిమ్మటన్

వేళాఘంటిక మ్రోసిన
కాలాత్యయమునకు నోర్వక యసరదారుల్
కాలాడించిన నిరుగడఁ
గైలా గొనరించి వీరుఁ గదలిరి తోడ్తోన్

వారికి వీరికిఁ దగిన సు
వారము లేర్పఱిచి భటులు పంచిరి నాఁడా
యూరూరుగ లేదింతకు
మాఱట స్వర్గంబు పొల్లుమాటలవేలా ?

ఆకాలమ్మున నీదృశ
ప్రాకారము లింతలేసి భవనమ్ములు దా
నేకరణిఁ బాడుకొల్పెనో ?
మా కర్థముగావు శిల్పమాహాత్మ్యమ్ముల్

ఒకబండ కొకబండ కూర్పిరి సల్పదిం
తవకాశ మీయ కెట్లతికినారో ?
సీలితా పడఁకుల నేయద్దుకొను నట్టు
లులిదింప కెన్నాళ్లు మలచినారో ?
అడుగు మేరకుఁ బుట్టి కధిక మొక్కొకశిల
ఏయుక్కుశకటాల కెత్తినారో ?
ఎంద జేసిబలాఢ్యు లీజాతి చక్కాలు
బురుజుల పై కెట్లు జరిపినారో ?

ఏమహాశిల్పి యాత్మ వర్ణింపరాని
యీకళారూప మెత్తి జీర్ణించి నదియొ ?
నేఁటి కాకట్టడమ్ముల నిదురవోవు
రెడ్డిరాణి యశోరూప రేఖలెన్నొ ?

తూర్పు సింహాద్వార తోరణకాంతులు
పురలక్ష్మితోడ దోబూచులాడు
పడమటి గవనుదాపలి మండువాబయ
ల్యెండ కాంతుల నీఁడులాడు
అయిమూల కోనేటి కవలి పూఁదోఁటలు
పైరుపచ్చలతోడఁ బంతమాడు
కొట్టవచ్చెను కోటకొమ్ములు నడిమింటి
నీలిమబ్బులతోడ నోలలాడు

నట్టి నగ రిప్పు డపరూప మైన దైన
నతుల విభవాభిరామము లాంధ్రరాజ
దగ్ధ సంస్థానములకు నిదర్శనంబు
ధర నశాశ్వతములకు నాదర్శకంబు.

ఇచ్చోట నాయురా లినుపగుం డ్లెడపెడ
వీథిపెట్టునఁ బాఅవిసరె నందు
రియ్యెడ జంపన లిటునటు పెనవైచి
యచ్చలమ్మున దూసిపుచ్చె నందు

రిట వీరశైవుల కీశ్వరార్పణముగా
నిరుకేల దానమ్ము లిచ్చెనందు
రిక్కడ సరదార్ల కిబ్బడి ముబ్బడి
సొమ్ము దోసిట విరఁజిమ్మె నందు

రచట విహరించె నిచట వాహ్యాళి వెడలె
నందు నెలవయ్యె నిందుఁ గొల్వయ్యె నందు
రాయభిజ్ఞానములు మచ్చు కైన లేవు
నేఁటి కాకట్టుకథ లెన్నొ ? నిలిచిపోయె.

ప్రబల వీరవసంతోత్సవముల తోడ
నోలలాడిన జిట్టగామాలపాడు
నామమాత్రావశిష్ట మైనను మహోజ్జ్వ
లాంధ్ర చారిత్రక స్థాన మాక్రమించె.

అదొక కుగ్రామ మాపుణ్య మగ్గలమ్ము
ఉజ్జ్వలజ్యోతి యిందెట్లు లూడిపడెనొ ?
యావ దాంధ్రప్రపంచ విఖ్యాతికైన
డామెకుల మామెజన్మించి నట్టిస్థలము.

ఆంధ్రులకు నామెపేరు విన్నంత మాత్ర
నొడలు పులకించు నావేశ ముప్పతిల్లు
నెందఱో పుట్టిపెరిగినా రింతులందు
నిట్టి వ్యక్తి జనింప లేదింతదనుక.

ఆమహావ్యక్తి నాఁటి సాయాహ్నవేళఁ
గొమ్మనాదులతోఁ గొంత గోష్ఠినడపి
అడుగ మఱచితి నలగామuఁ డనుజులకును
జదువఁబెట్టె నఁటోయి మాచర్లసీమ.

కొమ్మన్న

మీ రచటు వాసి చన్ననిమేష ముందె
కిక్కురన కార్తిగూరి జక్కించు కొంచుఁ
బరగణా సొంత మవ్వాలిపర మొనర్చి
గుట్టుచక్కఁగ గో ఖ్యాడఁ గొట్టి రమ్మ !

మొదట నరసింగ రాజెంత మొత్తికొన్నఁ
దా నొకింతేని విన్నపాపానఁ బోఁడు
నాలిమ్రుచ్చులు వేయిగుజ్జాలఁ బఱచి
మంది మార్బల మందంద సందుకొనిరి.

ఇట్టి చొప్పులు నొసువఁ బాలివియె మాకు
నోటి కొకమాటలై పోయె సీటిప్రజకు
సీమహానర్థమున కీవ హేతువనుచు
నడ్డదిడ్డముగా వాగి రైనకడకు.

మలిదేవుల వృత్తాంతము
తెలిసినదా ? నాఁడు దిక్కుదెలియక మనమే ?

కొలువున మువ్వలభీముని
తలవాయం దిట్టి వెలికిఁ దఱిమితిమమ్మా!

ఇటు కొలువు జరుగుచున్నెడ
నటు మాచర్లకును బయన మైరఁట వారీ
కిటు కెఱఁగి భీముఁ డాఁగినఁ
బుట మాఱ న్నెత్తు రురలఁ బొడిచిరి ములుచల్.

నాయఁడు వాఱోడక సభ
దాయము దెగటార్పుఁ డన్న తాత్పర్య మిదే
ఏయళువు సుళువు లెఱుఁగని
దాయయ్యకు నెన్నిగుండె లరుగం జెపుఁడీ?

ఇచ్చినఁ బుచ్చుకొందు మతఁ డీక పెనంగినఁ జూచుకొందు మఁ
చెచ్చటఁ జూచినన్ బరువు లెవ్వల నైనను నార్పు లిందుచే
బచ్చని కొంపగూలినది భాగము పంచిననాఁడు వారు వా
క్రుచ్చిన వైఖరుల్ తలఁచుకొన్నెడఁ దాపమువిన్నఁ బాపముక్

మంచన్న

అది కాదో మొనగాఁడ! వెఱ్ఱిప్రజ లాహ్వానించి పూజించి యే
బదులున్, వందలు, వేలు,లక్ష లిఁకనా పైయోపిసం తిచ్చియు
పదబంధుం డని విష్ణుదేవుఁ డని దీవ్యద్దంతి నెక్కించి మా
హృదయాలున్ వదనాలు నేలఁబడనూరేగించిరొక్కుమ్మడిన్

తన్ను డెబ్బదిరెండు గోత్రాల వారు
బలిసి సేవింప "సలక" టంచారి డిగ్గి
ఎదిరిపక్షము తనపక్ష మేర్పరించి
పాటిపాటమ్మ గుడిముం దుపన్యసించె.

చిచ్చులేక చిమిడి రచ్చుటి దునెదార్లు
రవదపుట్టి బడుగు లవలఁ జనిరి
అతనితోడి లోక మనువారు మనవారు
చేయి చేయి గలిపి గాయపడిరి.

అందనుక వచ్చినదె యని
మందస్మిత మొలుకఁ గులుకు మగువ కనియె వాఁ
డందంద పెచ్చరిల్లెడు
క్రం దడఁగన్ దొత్తుకొంగుకు కన్నుమ వెఱిగెన్

చేసన్నన్ గనుసన్నన్
మోసల నదలించి నేయముస నాయండే
బాసల మప్పెనో? తెలియదు
దాసులబలె నతనివెంటఁ దవిలిరి ప్రముఖుల్.

ఆమతద్రోహిపై నభిమాన మేమొ?
ఆతాంత్రికుని మీఁద నాదర మ్మేమొ?
పురిటిబిడ్డలఁ జంక నిడికి మున్ముందె
పచ్చిబాలెంతలే పయనించినారు

పాండవేయులు పడ్డ పాట్లెట్టి వంచుఁ
గడువృద్ధు లాగుబ్బుగా సాగినారు
పగ్గముల్, చిక్కాలు, పల్పు, లుగ్గాలు
మెట్లు, మేలుకట్లు, చౌక, ట్లుట్లు, తొట్లు
మూఁపుల మోపి నాములుపట్టి నారు
తల కొక్కపుట్టిగా ధాన్యసంచయము
నవసరమ్మున కగునాయుధశ్రేణి
ప్రస్తుతస్థితి కైనపాత్రసామగ్రి
తీరుతీరైన సంభారాదికమ్ము
బండ్ల కెక్కించి తొంబది తొమ్మిదూళ్ళ
మాచర్లపట్టణ మార్గమ్మువట్టె
నిండ్లు వాఁకిళ్ళన కిస్తువుల్ గొనక
గురజాలప్రజ వెట్టిగొట్టగుం పయ్యె
నామాల వారి కేనీమాలు లేవు
బాదమవారి కేభేదాలు లేవు
గోత్రాలవారి కేక్షాత్రాలు లేవు
మొండిబండల కైనగుండాల కైనఁ
జీము నెత్తురు కద్దు శీలమ్ము కద్దు
శీలమ్మసుతునకు శ్రీవైష్ణవునకుఁ
గాపుసారానీళ్ళు కణఁతినంజుళ్ళు

ముడి జొన్న యంబళ్ళు ముఱుగు పచ్చళ్ళు
తదనుయాయుల మాటఁ దడవ నేమిటికి?
మాచర్లతో వలు మలినమ్ము లయ్యె
సంగమడువు లన్ని భంగమ్ము లయ్యె
నాసీమప్రజల కేయగచాట్లు గలవొ?
గురజాలపౌరుల చెఱదొలంగినది
వీరశైవుల వేరువిత్తు పాసినది
నేటికిఁ గన్నార నిదురఁ గూరితిమి
ధైర్యమ్ముగా నింత త్రావఁ గల్గితిమి
అని ముందుఁ జప్పు డైనట్లు భావింప
నాగమ్మ దృష్టి వెనుకకు మరల్చినది.

వేగుల వెల్లం డనునొక
వేగరి చనుదెంచి వినయవినమితతనుఁడై
చాఁగిలి బ్రహ్మనాయని
యోగక్షేమమ్ము దెలుప నోహటిలంగన్

మన కొమ్మనాదు లే నీ
కనుమానము వలదు తెలుపు మను నాబిడకి
ట్లను నాతం డోయమ్మా!
కని విని మున్నెఱుఁగ మిట్టిగ్రామాంశమ్ముల్

ఆహూచర్ల యదృష్ట
మ్మెమందున్ జూడఁ గన్నులే లే వెందున్
స్వాముల మాట లటుంచుఁడు
సామాన్యప్రజలఁ బట్టశక్య మఁటమ్మా !

అడు గడుగున నారాధన
లుడుగని భక్తిప్రపత్తు లోకఁ డేమిటి నా
నోడువుట కందవు శ్రీవా
రడుగుట కందవు తదద్భుతాచరణమ్ముల్.

నాయకురాలు

ఆలాగా?నసుమంత్రపుఁ
బాలన మెన్నాళ్లు లెమ్ము బంటున్ బైదన్
జోలెన్ జాలెన్ దోడ్తోఁగని
యేలేశ్వర తీర్థ ముత్తరింపరె స్వాముల్

ఆ దాసరి మూఁకలతో
వాదాడక గమిడిదాఁటి వచ్చితివా ? లే
కేఁదాడనఁ గోదా డని
మూదలికన్ మన మహాత్వమును జాటితివా ?

వెల్లఁడు

చాటుదాఁక నందు వేటికా యడియాస
నోరు మెదల నిచ్చినారె వారు
గమిడి ద్రొక్కి గజ్జె కట్టినాఁడనొ ? లేదొ
వెంటనంటి రచటి వేగువాండ్రు.

జియ్యా రని పిల్చి నామాలు చెఱపువారు
తంబురా దండె రెండుగాఁ దాఁచువారు
చిఱుత లూడిచి వలెవాటు చింపువార
లప్పటి యవస్థ నేమని చెప్పికొందు.

పిన్నలు పెద్ద లీకరణి బిట్టదలించుచు నుండ నింతలోఁ
గన్నమదాసు వచ్చి ననుఁ గన్గొని పక్కున నవ్వి చేతిలో
నున్నయినుప కడ్డి మెడ కొత్తి పెనంచి మలంచిపట్టి బ్ర
హ్మాన్నగృహమ్ముసేర్చెనతఁడాయముగాయముగా హసించుచున్.

అడియరిదాసరి వైతివె ?
బడవా ! మీయమ్మగారు పంచిరె ? మెడలోఁ
దొడ వేమిటి ? కానుకగాఁ
బడసితివా ? గూఢచారివని బైటఁబడెన్.

ఆ వనితా మూలమ్మున
శ్రీవైష్ణవ వేష మీకు సిద్ధించె నిటుల్

శైవాగ్రగణ్యు లెందఱు
మావేషమ్ములను దిరియ మరగిరి చెప్పుమా ?

* కొట్టాలమిట్టఁ గనుపుం
గొట్టేరో ? కాల్జారి నీవ కుతిలపడెదవో ?
గుట్టెఱుఁగక వచ్చితి వా
పట్టున భూతాలు పట్టి పల్లార్చునురా ?

తారై పంచిన మేమై
సారాంశము దేల్తుమే ? విచార విదూరుల్
కోఱలు వెఱుకన్ మూఁడికి
శూరలు సాచునెడ గాసుపడరా ? చెడరా ?

ఆయువు మూఁడిన వాఁడీ
చాయను రాఁగలఁ డదృష్ట జాతకుఁడవు నీ
వాయమకున్ భృత్యుఁడవై
మేయుము మాగమిడిఁ ద్రాక్ష మెదుపుదు మనియెన్.

చివరి వాక్యమునకు మోము చిట్లగించి
నేత్రకోణములన్ జింతనిప్పు లుమిసి
ఉరక ముకుఁగ్రోళ్ల వేడినిట్టూర్పు పుచ్చి
నాయురా లింకఁ గానిమ్మనంగ నతఁడు.

---

* కన్నమదాసు కాపుండు చోటు.

వెల్లఁడు

అపుడ మానసపుత్రున కప్పగించి
నాములం దాఁటఁ బంపించె న స్నతంతు
కడకుఁ గన్నమ నెట్టెట్టొ కన్మొఱంగి
పఱచి మోఁకాళ్ళ కురువపై విఱుగఁ బడితి.

బొప్పాడి బుగ్గనాదులు
తెప్పలనాయకుని మీఁదఁ దిరుగంబడి వా
తప్పునఁ బరారులై యడి
గొప్పల మార్గమ్ముపట్టి కురువం జేరన్.

నాదురవస్థఁ దెల్ప విని నాకులు, గూడలు, కాళ్ళు (వేళ్ళు ని
పాదిగ "సర్ది"వారిదురవస్థలు దెల్పిరి కూడు నీళ్ళు లే
పీఁదర, కుళ్ళుచినుక లిఁకనే మొదలాడిన డాక్టర్ రాత్రికిన్
మేదరమెట్టుఁ జేరి తడిమీఁద శయించితి మంతవేగినన్.

కేగల్లో యని నలువురు
సాగిరి నే నంతఃబోక జనపదముల బా
గోగుల నరయుచు శత్రుల
తేగడ గమనించు చరుగుదెంచితి నమ్మా!

మీ రిచ్చిన "ఫర్మానా"
లూరూరికిఁ జేరినవి యహోరాత్రమ్మున్

బోరాడుచున్నఁ గొందఱు
చీఱికిఁగొన రించుకైన శీలమ్మసుతున్.

ఊరూర రెండుపక్షము
లేరుపడెఁ బ్రహ్మనాయఁ డిరువాఁగుల చ
ర్చారతిఁ దేలుచు వింతప్ర
చారమ్ములఁ బ్రభుత నెఱప సాగె శఠుండై.

నాఁడు మీరిచ్చినట్టి మాన్యమ్ము లెల్లఁ
బేరుపేరున నూటికి నూఱు మార్చి
మన్నెములు సొంత మప్పుడే మల్లఁబడియె
మిగతగ్రామాలు గ్రుక్కిళ్లు మ్రింగఁ దొడఁగె.

**నాయకురాలు**

ఇఁకఁ బ్రభుధర్మ మెందుకొఱ కేడ్వనె? దా నిపుడేడ్చుచున్న దిం
కొకఁ డెడసేయవచ్చు నిది యొప్పునె? నాతలె నేలఁబడ్డదా?
శకపురుషుం డతండు తనశాసన హస్తము మూలఁబడ్డ నాఁ
డెకసెక మాడువారి గమనించు నదెప్పుడొ? తేలకుండునే?

ముందుముసళ్ళపండువనిమూర్ఖుఁడెఱుంగఁడుజేపొ?మాపొ?మీ
రందఱుసూచుచుండ దురితాత్ముఁ డొనర్చిన మార్పు లెత్తుగన్
గొందును పేరుసెప్పి మఱి కోనకుఁ గానకు నీడిపించెదన్
బందెల కెక్కఁద్రోలి గుణపాఠము నేర్పెద నేతదర్థమై

కొమ్మనా! నీవు తెరువాట్లుకొట్టి బ్రదుకు
నల్లమల బోయలన్ జెంచునాయకులను
సరగ గూపెట్టుకొని రహస్యమునఁ జుట్టు
ముట్టి మాచర్లపురిఁ గొల్లకొట్టి రమ్ము.

వెల్లనా! గురుదేవు లేవెంటఁ జనిరో?
తెంపుమైఁ బల్లెపల్లెఁ గాలింపవలయు
గంటనాడులు పోయి మా రాచపురమ్ము
శ్రీగిరిప్రాంతములు పరీక్షింపఁ గలరు.

మంచనా! శత్రుకోటి వంచించువాఁడ
వీవు దక్క సమర్థుఁ డిం కెవఁడు గలఁడు?
బ్రహ్మనాయని నిజపదభ్రష్టుఁ జేసి
వలస పంపక పలనాట నిలువలేము.

అతఁడు మహాస్నిగ్ధ ద్యూతక్రియాభిలాషి
కోడిపందె మనన్ జెవికోసికొనును
ఈమిషఁ గుక్కుటద్యూత మేర్పరించి
కొంప లాఱిపి మఱి సాగనంపవలయు.

పొరుపుపుట్టి చన్న బుగ్గనప్రభృతులు
కోడిమేడమునకుఁ గూర్చువారు
వారిఁ జేరి మీప్రచారమ్ము సాగింపు
డింక సాధ్యపడని దేమొ చూతు.

ముట్టఁజెప్పకున్న వట్టిఫర్మానాల
ఫలము బలము లేదు వలసి నంత
సొమ్ము వెచ్చపెట్టి కిమ్మన నీకెల్ల
వారి నోరుగట్ట వలసియుండు.

పూచికత్తు లడిగి పుంజైనఁ బెట్టైన
బీరువోవనీయ కూర నూర
గ్రుడ్డుగ్రుడ్డునకును గ్రుడ్డులోఁ బిల్లల
కెంచి సంచకరవు లిచ్చిరండు.

నే గురజాల కేగి ధరణీపతి చెంగట వారి వారి ప
న్నాగము లుగ్గడింతు నఁన స్వని వారిది బాగుబాగనన్
నాగమ కన్నుదమ్ములు వొసర్చిన వస్ఫుటమందహాసముల్
జేగురు వన్నెలన్ మదుగుచేసిన వెన్నెల లారఁబోయుచున్.

అంత నమస్కరించి సెల వందిరి వా రిఁక నాపడంతి వి
శ్రాంతిగృహమ్ముసేరి మృదుశయ్యఁ బరుండి, భవిష్యచింతనా
భ్రాంతమనస్కయై కొలువవచ్చిన సేవకురాండ్ర సైతమా
వంత గణింప దామె కపు డన్నముఁ నీళులుఁ గూడఁబట్టెనా?

ఆ నడికిశేయిఁ "దీర" ప్రయాణమైనఁ
బారిపార్శ్వకు లాయుధప్రతతితోడ
బలిసి చనుదెంచి రాచూకి తెలిసి పల్వ
రప్పారప్రముఖులు సాగనంపినారు.

# నాయకురాలు

## దశమఖండము

కొమ్మనదొట్టి ధూర్త లోకకొందఱు నాయకురాలి బోధన
పెమ్మెమ్మల కెక్కి కొల్లగొన నేగి రహస్యముగాఁ బురోపకం
ఠమ్మున డాఁగి చీఁకటిపడఁగ దడవిండ్లు కటారు లీఁటెలో
కుఱ్ఱమ్మడిఁ బట్టి ముట్టిరి జనౌఘము మాటుమణంగు నంతకుఁగ

ఆరెకులన్ వధించి నిశితాయుధముల్ ఝళిపించుకొంచు ని
ద్రారతు లైనవారి వెనుదట్టుచు లేచినవారి మొట్టుచున్
పేరెమువాఱు వారి నిలఁబెట్టుచుఁ బైకొనువారి మట్టుచున్
ఘోరముగాఁ బురమ్ము కలగుండువడన్ దెగిదోఁచుచున్నడన్

కొట్టికాం డ్రెల్లఁ గొట్టాలమిట్ట కుటికి
కన్నమన్ లేపి స్థితిగతుల్ విన్నవించి
రమ్మహావీరుఁ డాగ్రహోదగ్రుఁ డగుచుఁ
బండ్లు పటపట మని గీఁటి పాన్పుడిగ్గి.

భైరవ ఖడ్గము న్నసిలి పట్టి మృగమస్త్రుల ముట్టపించు కేం
కీరవ మట్లు పైఁబడి పెళిల్లు కళిల్లని హీఁపుమూఁపులున్
మోరలు, బోరలున్ బగుల మొత్తిన నుక్కిరిబిక్కిరై పటా
చోరులు తప్పఁ గ్రుంకుటకుఁ జూచి రతం దపు డార్చి పేర్చినన్

గుండెలు జారి నిల్చి రడుగుం గదలించినఁ దాట లొల్చెదన్
జుం డని మండెపెట్టి తగుజోదుల నచ్చటఁ గాపువెట్టి నా
యండు వసించు సౌధమునకై పరతెంచినఁ జంద్రవంక కా
తం డిపు డేగె నన్న విని తా నటకుం జని దాల నిల్చినన్.

నాయఁడు చేరఁబిల్చి జననాశ మొకించుక లేదుగా? పశు
ప్రాయులు నాగసాని మనపై కుసికొల్పిన ముట్టడించి ర
న్యాయముగా వధింపఁ దగ దాజగజంతకు బుద్ధివచ్చు న
ట్లీయుసు ముక్కడాలఁ దలకెత్తి చపుళ్ళకుఁ ద్రోలి ర మ్మనన్

కన్నము మిన్నుముట్టి గడెకాఁపులకుం దగుశిక్ష యైనదిం
కెన్నటి కిట్టిచేష్ట లొనరింప రొనర్చినఁ దత్ క్షణ మ్మొడల్
సున్నముగాక తప్ప దనుచున్ సెల వందిబిరానఁ జేరి వా
రి న్నడిపించె సైకతపరీతవిభాగకుఁ జంద్రభాగకున్.

మడమ ద్రిప్పిన సంచు మెడఁబట్టి గెంటి కి
మ్మననీక బరిప్రక్క లంటఁబొడిచి
వ్యక్తి కొక్కొకజాతె వంతున నిన్నూఱు
సంచుల కిసుము పట్టించి లాడె

దూడిదుంగల నిండెదొలఁగ మూఁపులకు నె
త్తించి ధేయని హెచ్చరించుకొంచు
గురజాల యరుజుల కుంటగట్టున మండె
పెట్టించి కెళవు లాఁకట్టె నతఁడు

నాయురాలికి నెట్లొ చూచాయ దెలిసి
పరువు పరువున వచ్చి జబ్బల్లు ద్రొక్కి
ముఁవలభీముఁడు మున్నుగా మోహరించి
నోరి కసిదీఱ నీక్రియ దూఱఁదొడఁగె.

కడజాతి తొత్తుకొడుకా!
కడుపుం గక్కుఱితిగూరు కమతీంద్రుకు నీ
మిడిమేల మేల చెపుమా ?
పడియుండక చేదుదిన్న పసరముభంగిన్.

నీయబ్బ సొమ్మని నేరుగాఁ గొట్టాల
మిట్ట దొడ్డబవంతి గట్టినావు
మారాజు భరణమ్ము తేర మెసెసువారి
యెంగిళు ల్గుడిచి యుప్పొంగినావు
నామాల స్వాముల హామిక నీమాడిక్కఁ
గొంచకూళ్లులు గొల్లగొట్టినావు
కొంపల గుత్త లాకోణంగి మలపల
వీపున మూఁపున వెలిఁగినావు

పరులఁ దిరిసి బ్రదుకు బాడుగో ల్పన్యాసి
వెంత వేడబములకె త్తినావు
తాట లొలిచి యూరెదండెలు వేయించి
గడ్డిపెట్టి బుద్ధిగఱపుదాన.

నీ కెవఁ డానతిచ్చెఁ బురణింతువు మాటికి బూకరింతు వీ
దూఁకులు మాకడం బడవు దుర్బలులై పరువెత్తువారి న
డ్డాఁకలుపెట్టు మీశ్వరుని కైనఁ దలంక మదేమి? మాట మే
మిం కడజాతి పీనుఁగుల కే భయమందుదుమా? నికృష్టుఁడా?

నాయుఁడు పంచెనో? మనుజనాథుఁడు పంచెనొ? బుద్ధిమాలి నీ
వే యరుదెంచినాఁడవొ? సకే మితిమీఱి చరించినాఁగె నీ
యాయువు గట్టి దిందనుకనైనఁ బ్రమాదము దక్కి నిల్చినా
వోయి! బిరానఁ గాల్గొలఁది నూడనిఁ బాడుము లేదమూఁడెడుఙ్

కొండికవై చెడందలఁచి కూర్చెదు వారి నెఱుంగ కాతఁ డు
ద్దండత విఱ్ఱవీగెను బడాబదలై చను రాజ్య మింత కీ
పిండము నాసఁజేసి మనపెద్దలు ప్రెగ్గడలై ప్రభుత్వమున్
బిండిరి ధర్మమున్ దగులఁ బెట్టిరి మి మ్మెనగఁ ద్రోలి రీవెసన్.

అనుచు నాయకురాలు బా హాప్పళించె
మువల భీముఁ డదాటునఁ గవరఁబడియెఁ
గన్నమకుఁ బట్టరాని యాగ్రహము వొడమి
ఒక్కచఱపున నిరుగడ లొత్తరించి

భీమున్ బి ట్టదలింప నాతఁ డొడిసెన్ భీతావహుండై తదు
ద్దామ ప్రక్రియ కోహటింప కితఁ డుద్యద్బాహుఁడై వైచినన్
సామర్థ్య మ్మతి పాటె నాతఁ డితఁడున్ సంరంభతుంగాంగుఁడై
ఆమెన్ బట్టుట కుద్యమించియు నసహ్యం బంచుఁబో నాడుచున్

కన్నమ

నీయుల్లకుట్టు వాక్యము
లాయములన్ దూసిచన్న నైనను బ్రహ్మ
నాయని యనుమతి లేకయ
నీయసువుల కెత్త వెఱచి నిలిచితి నతివా ?

లేకున్న నీదునాలుక
చాఁకునఁ బడఁజీల్చి యుప్పు పట్టింపనఁటే ?
నీకార్పణ్యవివాదము
లూఁకొట్టు నికృష్టయోగ మున్నది మాకున్.

నాజాతి దెప్పిపొడిచితి
వేజాతికి లేవు తూఁటు లెవరైన నొకే
రోజ జనింతురు దురుసున
రోజింపవు నఖముఖాల నూడి పడెదకే ?

ఈలోన మువలభీముం
డోలో లని శృంఖలమ్ము లూడిచి పైకిన్

ద్రోలిన దొంగలతుదు మపు
డాలలనా హస్తసంజ్ఞ నాతని గవిసెన్.

కవిసిన గుంపులన్ మెదిపి కన్నమ దీల్పడ మొత్తి సాల్పడన్
జివరకుఁ బట్టి కట్టి పురిఁ జేర్చి రహస్యగృహాన దాఁచి రీ
వివర మెఱింగి నాయఁ డతివిస్మితుఁడై గురజాల కేగి భూ
ధవునకు విన్నవించె వనితా విపరీత విఘాతకృత్యముల్.

పడిపడి యప్డ్వాచుక్క తెగిపడ్డ తెలుంగున వ్రాలి మూతిపైఁ
బొదుచుచు నాగసాని తనమండలి రాజును లక్ష్యపెట్ట కి
ట్లడిగెను దొడ్డకాంత్రము వశీ రంటివి, దొమ్మిగఁ ద్రోఁచిరంటివూ
రడలిన దంటి విట్లుతగ దంటి వదెట్లొ వచింపకుంటివే ?

త్రోఁచెదరా ? నోరెత్తినఁ
దాఁచెదరా ? సొంతమాటకు తార్మారైనన్
గోఁచలు సైతము సైతురె ?
మాచర్లస్వామి లింత మాత్ర మెఱుఁగరే !

మా రాజిచ్చిన వృత్తులు
గారించితి రంచుకతన గ్రామాదులలోఁ
దీఱని యలజడి పుట్టెను
సారాంశము దీనఁ బట్టి చదివినఁ దెలున్.

* ఈప్రజాశక్తి రాజ్యాల నేర్చిపేర్చు
నదినవగ్రహాకూటమ్ము నవఘళించు

* లోఁగడ "ఈప్రజాస్వామ్యదురభిమానప్రచార"మనునది సొల్లుంపనము

దండనీతికి నందులోఁ దావు లేదు
సామ్యసిద్ధాంతములఁ గాని చక్కఁబడదు.

ఎఱిఁగి యెఱిఁగి లోక మెదురీఁదుచుంటివి
స్వార్థపరుఁడ వింతసాధకుఁడవు
కల్లినాడు చాఁటి పద నిగ్గు దీతురు
స్థానబలము నాప శైనఁగలదు.

కొమ్మనాదులు తీర్థాటనమ్ము నెఱపి
చెన్నకేశవుఁ గొల్వ వేంచేసి నపుడు
పూర్వవైరములం దలపోసికొంచు
దొడ్డకాంద్రని దూఁకి కాల్దు ద్రివ్వనగునె?

ఈలాడె దూడి దుంగలు
చాలక సన్నంపు టిసుక జాలెలు సైత
మ్మేలా మోయించితిరో ?
బాలిశ రాజ్యమున నిట్టి బాధలు కొఱయే ?

అన్నదమ్ముల సామరస్యమ్ము చెఱచి
నాటక మ్మాడఁ దలపడినాఁడ వీవు
తుదకుఁ బలనాడు నెత్తుట దొప్పదోఁగి
నీకతాన శ్మశానమ్ము గాకపోదు.

మొగమటుగంటువెట్టుకొని మూఁతిబిగించెదవూపు గాడ్పులన్
సెగలువెలార్తువెందులకుఁజెప్పుము నాయఁడ! నాదు వాక్యముల్

వెగ టనిపించెనా? వెలమవీరుల కట్టులె దోఁచు నన్నిటఁ
దగవరివే? యథార్థ కథనమ్మున కీమొగమోట మేలనన్.

రాజు కే లెత్తి నాయకురాలి నుడిపె
బ్రహ్మనాయుఁడు తత్స్వభావ మ్మెఱింగి
పాటిసేయక నలగామపార్థివునకుఁ
దమ్ముగుఱ్ఱల కుశలవార్తలను దేల్చె.

అప్పుడ రాజవీథి భటు లార్చుచు గుంపు నదల్చి పలుక్కుఱాల్
గుప్పుచుఁ బోయెఁ బట్టుఁ డనుకొంచు నె పర్విడుచున్నఁ జూప తే
మ ప్పనువా రిదేవిలయమా యనువా రెడసొచ్చు వారునై
తెప్పలు తెప్పలై పరువుదీయుచు, డాయుచు, మ్రోయుచున్నడన్

అమ్మహాజనకలకల మ్మాలకించి
ద్వారబంధము చేరువఁ జేరె నామె
గంటనాదులు యాదృచ్ఛికముగ వచ్చి
ఫాలమునఁ గేలు గదియించి పలికిరిట్లు.

ధూర్తుఁ డొంతకు లేఁడు దోర్బల మ్మెసఁగించి
దృప్తుఁడై సంకెలల్ ద్రెంపినాఁడు
ఉక్కుపెండెము సంధు లూడిపోఁ బడఁదన్ని
బీభత్సగదురఁ గుప్పించినాఁడు.
కావలివారి మోఁకాళ్ళ కీళ్లెడలించి
అదలించువారి నోళ్ళడఁచినాఁడు

సీళ్ళుసూపిన గంధసింధుర మ్మటువోలె
మందిపైఁ బడి మాఱు మసలినాఁడు

ఊాలు రువ్వి గనపరాకులు నిగిడించి
పట్టుఁడంచు గోలపెట్టినాము
జాతి మాలగాని జన్మ రాక్షసుఁ డమ్మ!
దులబరించి మమ్ము ద్రోఁచిచనియె.

ఆబిడ నో రడంచుకొను చంతకుఁ దెచ్చితి రింద ఉంటిరే?
గూబలు పిండి మా డదరఁ గొట్టిన నాతని తాత లడ్డమా?
దేబెలఁబోలె వెన్క కరుదెంచితి రేమనుకొన్న నేమగున్
నాబరవాసె? మిమ్ముల ననం బని లేదు తదర్థ మల్లదే?

నాయఁడు సేరి రాజుకడ నాటక మాడఁ దొడంగి నాఁడు నా
కాయము గాయ మయ్యెఁ గొఱగాని ప్రసంగము లాలకించినన్
మాయకు మాయ లొడ్డుమనమాంత్రికుఁ డీసడి కట్టెనేని క
ట్టాయితమై ప్రయాణ మగు నంచు నెదో చెవికొట్టి చెప్పినన్

వారు పనివిని రాత్మవికార మఱఁచి
నాగసానియు లోపలి కేగుదెంచె
నంతలో నరసింగరా జరుగుదేర
బ్రహ్మనాయఁడు కుశలసంప్రశ్న నెఱపె.

వారు నిలేఁడుఁ గొంతవడి ముచ్చటించిరి
వాలకములఁ గూర్మి జాలువాఱె

మనసు లొకత్రోవ మాట లింకొకత్రోవ
ఒకరి నొకరు మించి రుక్కవముల.

నరసింగరాజు మాటల
వరుస ననున్ రాకరాక వచ్చిన చుట్టల్
పిరె మైరి రేపు తమతమ
తిరుమాళిగఁ ద్రొక్కి సేదదేరెద మనియూ ?

బ్రహ్మనాయఁడు

యువరాజు లింతదూరము
నెవ మొడ్డిరిగాని ప్రాంత నెయ్యముకలిమిన్
అవసరము దీర్చు దొరలన్
దవులకే విందులముగాక తప్ప దెమైనన్.

అనిన నాయకురాలు కన్నార్ప నాతఁ
డైన లెం డని నలగాము నాజ్ఞఁ గడసి
సరగ మేఘప్రతిచ్ఛందసౌధమునకు
బ్రహ్మనాయని గొంపోయెఁ బ్రాహ్మణుండు.

నాయని రాక కానందన మ్మెసఁగ
భూరమాదేవి యుప్పొంగిపోయినది
వలసివచ్చిన మాడ్కిఁ గలవరించినది
తలు పోరగా నిట్లు పలుకరించినది

మా వీరవిద్యాకుమారకుల్ సుఖులె?
నీ పన్పుఁజేసి రాణించుచున్నారె?
శీలాంబికకు నూఱు సేకొన్నవైన
సొంటికొమ్మా జన్మ శుద్ధురా లామె
కోడలు మాంచాల కుశల మున్నదియె?
అబ్బాయ కాబిడ కాంతర్య మున్నె?
బాలచంద్రుఁడు సంగడీలతోఁ గూడి
పాయకట్టుకు ముద్దుసేయుచున్నాఁడె?
చుట్టాలు, పక్కాలు సుఖ మున్నవారె?
వియ్య మందినచోటఁ గయ్యమ్ము దప్ప
దైనను గండువా రలఁతులం జనరు.
నాయనా! మీ కిన్ని నాళ్ళకా సెలవు
మే మైన గుష్టికి రామా? మతేమి?
కలఁతలు సాజముల్ గాని మీవంటి
ప్రాజ్ఞుల కెన్నఁ డీపట్టింపు దగను
పెడత్రోవఁ బట్టినఁ బిన్నలన్ గసరి
నలువైన మార్గాన నడపింపవలయుఁ
బెద్దల యొద్దికల్ ప్రిదిలిపోనీక
మంచిచెడుగు లేర్పరించు టుత్తమము
పలనాడు రెండుగా భాగించినారు
కులమతద్వేషాలఁ గూల నున్నారు
సాటివారలు విన్నఁ జొకచేసెదరు

ఏమాత్ర మీలున్న నెత్తివచ్చెదరు
అన్నదమ్ములు చావు కాసచేసెదరు
బావమఱందులు బ్రదుకఁ గోరెదరు
అను సూక్తి ప్రత్యక్షమైన దీనాఁడు
మైలమ్మతనయుం డమాయికుండందు
రతనితోడిదె లోక మను నాసుతుండు
ఈముప్పు దప్పింప నీవు గాకొరులు
కన్పట్ట రని నీరుకను లద్దికొంచు
బోరుబోరున నేడ్చె భూరమాదేవి
నిలువుఁగాళుల విని నిట్టూర్చి తుదకు
నాయందు విధివిధానము దప్ప దనియె
నింతలో నడబాల హెచ్చరించినది
అటు రెంపుమా డంజ లకుగ బ్రహ్మన్న
నరసింగరాజు చిర్నగవునన్ డాసి
స్నానార్థమై భుజిష్యల నియోగింప.
బ్రహ్మనాయఁడు
తెలిసఁలివెచ్చని నీటన్
జలకము నవరించి జపము నలిపి జరీపూ
వలువం దాల్చి త్రిపుండ్ర
ముల్లు దిద్ది వచించె మోదముద్రితముఖుఁడై.

భరతపక్షు లుభయ పార్శ్వమ్ములను నిల్చి
ప్రథమకబళ మర్థిఁ బడయకున్నఁ
గుడువ నొల్ల ననుడు మిడుకుచుఁ దెప్పించె
భూరమాసుతుండు పులుఁగుజంట.

కగ్గి కగ్గని లేఁత కదళీ దళ మ్మొండు
పర్వ రీణము పుచ్చి పాయఁదట్టి
షడ్రసీగ్రాసమ్ము చవు లూర వడ్డించి
ప్రక్కల కొదిగిరి బాలసేంద్రు
బ్రహ్మాన్న వార్చి కబళ మట్టిటు విదుర్ప
భరతపక్షుల కనుల్ పలుకఁబాఱె
మునిముట్ట కతఁ డాకు ముడిచి పోవం ద్రోఁచి
హ స్తసంక్షాళన మాచరించె
అవలఁ బొంచి యున్నయువరా జెఱుఁగ నట్లు
నాగసానిఁ బ్రాంగణమునఁ జూచి
పీఁట వచ్చి రింద మారగిం పైనది
కూరుచుండుఁ డంచుఁ జేరఁబిలిచె.

రాజసుతునకు నాయకురాలి కపుడు
బిక్కమొగముల నెత్తురిచుక్క లేదు
నాయఁ డణుమాత్ర మైనఁ దొనంక కతని
ప్రేమ లతాంబూల మిసుమంతె ముట్టుకొనక.

తమ్ముండా! మీసపర్యలఁ దనిసినాము
పోయి వత్తుము సెల విందు ప్రొద్దు గలుగ
నన్నగారు ప్రతీక్షింతు రాగసంబు
నోచినన్నాళ్ళు కన్నమ నాపుఁ డవిన.

గుండెలు గరిసెలు వడియెన్
గండలు సలు పెక్కె గాలిగఱచిన పుండ్లై
ఒంటారుల చూపు లటు నిటు
లుండలు చుట్టుకొని నేల కొఱగెన్ సురిఁగెన్.

నాగసానిని క్రీఁగంట సైగ చేసి
నట్టువడి క్రుస్సె నలుగురాజ్ఞాందనుండు
అపుడ బలుమబ్బు ఛాయల నవఘుళించి
అళఁదిగువ్వను సాళువ మ్మడఁచికొన్న

గంటన; కొమ్మన పందెము
గొంటకు వాచఱచి మోఁదుకొని యుద్ధతులై
వెంటాడు ప్రజలిదే మని
గెంటెరి మెడఁబట్టి రాజ గృహావీథులకున్.

అందు గంటన్న నిలుపోవ కాగ్రహించి
బ్రహ్మనాయఁడు విన నిట్లు పదరినాఁడు
అనద మాచర్లపులుఁ గోడె నన్న విసఁడు
జబ్బ డలుపడె గుఱజాల సాళువమ్మ.

మాచర్ల కోఁచ కోళ్లే
మీచాయకు వచ్చి గెలుచు టేమీ? చెప్పఁడీ?
వాచాచతురత మెఱయన్
నీచుఁడు న న్నంటఁ బొడిచి నెత్తము గొనియెన్.

ఆ నిందావాక్యములకు
ప్రమానై నాయందు నిజము మాటాడితి వ
న్నా! నీవు బ్రదుక నేర్చిన
మానవుఁడవు లేక యిచట మనవళ మగునే?

మీ మా కొలఁది నిరూపణ
కేమాదిరి భట్టుమూర్తు లెట దొరకిరి మా
సీమకుఁ బంపుఁడు విని మే
మామోదించెదము నిత్య మకలాపములన్.

అన విని నాయురా లొకరి నన్నఁ బ్రయోజన మేమి? మీకథల్
దిన మొకతీరుగా నిట నుతింతు ర దిం దొకతీరు పట్టుప
ట్టని పరిమార్ప మందువె? యథార్థ పరిస్థితు లుగ్గడించినన్
విని వినసట్టు లుండ కది వెల్లడి సేతు వదేమి? నాయఁడా!

అదికా దల్లులతోడ నేమి? మన మిందే కోడి మేడమ్ము నస
ల్పద మిందోడినవారు భూములును గీముల్ వీడి యే లేశ్వర
ప్రసాదమున్ గాల్నడ నుత్తరింపవలె నేడద్దమ్ము ల్ గాటవిన్
మొదలం గావలెఁ బందెముం జఱుము సందేహమ్ము లేకుండినన్

మలిదేవుం డిట లేఁ డదెట్టులను సంప్రశ్నమ్ము రావచ్చు మా
నలగామప్రభువుండెనా? నిరుపమానం బైన నీప్రజ్ఞకున్
దలక్రిందై పలనాటి భూపతు లభేద్యం బైన రాజ్యంబు ప్ర
క్కలు గావించిరి నీతలంచి నటు లేకార్యమ్ము గాలే దనన్.

ప్రాణిద్యూత ప్రసంగమున్ వినిన బ్రహ్మనాయఁ డోళ్లోళ్ళగా
కేనుంగున్ సిడి కైత్తినట్టు లయి సాధింపంగ మీ కొండు లే
దీనాఁడైన పరాభవమ్మునకు జేపింకేమి జోడింతురో
కానిం డంచుఁ జిరాకు మీఱఁ జనె ఛీత్కారమ్ముతో రమ్ముగన్

ఆనాఁ డుజ్జ్వల మత్స రాగ్ని కణ బీజాంకూర మేర్పడ్డదం
చానాగమ్మ చెలంగె నాయమకుఁ దోడై భూరమానందనుం
డానందించెఁ దదంతరాత్మలు భవిష్యత్కార్యకౌటిల్యచ
ర్చానిర్ణాయకముల్ ధ్వనించిన వవస్థాభేదశూన్యమ్ముగన్,

# నాయకురాలు

## ఏకాదశఖండము

బ్రహ్మనాయఁడు మాచర్ల పట్టణమున
కర్థరాత్రము చనుదెంచి న ట్లెఱింగి
ప్రముఖు లెల్లరు తమకార్యభార ముడిగి
మఱుదినము కొలువుకూటమ్ము దఱిసినారు.

సకలబంధుమిత్రసచివపురోహిత
భటకదంబకమ్ము బలిసి కొలువ
మల్లుదేవుఁ డనుపమానసింహాసనా
సీనుఁ డయ్యె శౌరసేనివోలె.

బ్రహ్మనాయఁ డాసభాస్తారులకు నెల్ల
విషయ మోలి విన్నవించుచుండ
భటుఁ డొకండు వచ్చి ప్రణతుఁడై చేసేత
జాబు నంపె రాజసముఖమునకు.

నృపతి విచ్చి చూచి నిర్విణ్ణుఁడై యుండ
మింద మనుచు మంత్రి కిచ్చి పుచ్చె
బ్రహ్మనాయఁ డధిపుభావమ్ము గుర్తించి
విస్ఫుటముగ సభకు వించె నిట్లు.

శ్రీమన్మహావీరకామేంద్రవిభుఁడు
మీయన్న నలగామమేదినీవిభుఁడు
పలనాటి సామంత పరిపాలకులకు
మానభూషణులకు మల్లిదేవులకు
దీవించి పంపు సందేశ మే మనఁగ
నేఁటి సంక్రాంతి కిచ్చోట మే మొక్క-
కుక్కుటద్యూతమ్ము నెక్కొల్పినాము
పందెమ్ము చఱచు భూపాలకుం డున్నఁ
బై పోటి పచరించు పాలెగాఁ డున్నఁ
గోడికి నెదురొడ్డు కొఱవకాఁ డున్న
వారు వీరన కెల్లవారు రావచ్చుఁ
బాల్గొని విజయమ్ము వడసి పోవచ్చుఁ
బ్రభవింపవలెనన్నఁ బౌరుషజ్వాల
ఉసికొల్పవలె నన్న నుత్సాహశక్తి
తొలఁగింపవలె నన్న దుర్బలత్వమ్ము
పోకార్పవలె నన్న బుద్ధిజాడ్యమ్ము
సాగింపవలె నన్న స్వాతంత్ర్యరథము

వెను కంజవేయని వీరజాతులను
నిటువంటి ఘట్టమ్ము లెంతో తోడ్పడును
కావున సన్నాహకలితులై రండు
అశ్రద్ధచేయకుఁ డాలసింపకుఁడు
ఏమొ! వ్రాసితి మని యీసడింపకుఁడు
ఇట్లుమీ... యంచుఁ బఠించి నాయందు
కొలువుకూట మ్మెల్లఁ గలయ వీక్షింప.

పెద్దన

ఫాలము కేల వ్రేసి తనుఁబట్టిన భూతము లట్టి వింతకున్
గాళులు, చేతు లార్చెడునొ కానొక చక్కని కీలుబొమ్మ భూ
పాలుఁడు వారి యిష్ట మెటువచ్చిన నట్లెగఁద్రోయుచుండి రే
తాళము వైచినన్ బదము దప్పఁడు ము ప్పనఁ డేమికర్మమో!

అలగాజాతుల కైనపందెము లఁటయ్యా! జాతిశౌర్యోజ్జ్వల
జ్వలనజ్వాలల కిట్టి జల్పిత మపూర్వ మ్మప్రశస్త మ్మను
జ్జ్వల మల్పిష్ఠ మనిష్ట మీకపటచేష్టల్ నమ్మువా రుందు రే?
కులవృద్ధుల్ గుణవృద్ధులుండి రొకసంకోచమ్ము బాధించెడున్

సామంతప్రభు లన్నమాటల రహస్యం బేమి? తానొక్కఁడా
యేమీ? మధ్యమమండలేశ్వరుఁడు చోడేంద్రుం డుపేక్షించిత
న్నామోదించినఁ జెల్లెఁ గాక మన కెట్లాయోగ్యతల్ గల్గమీ
మోమోటమ్ములుదక్కనిక్కము వచింపుండన్న విభ్రాంతుఁడై

కొమ్మరాజు

అవునయ్యా! నిజ మాడినాఁడ విది యన్యాయంబె మద్దేవభూ
ధవులన్ గాముకఁ గప్ప మిం డనెడు తాత్పర్యమ్ముగాఁ దోఁచుని
ట్టివ యోజించిన నోటఁ జొచ్చి తుదిమూఁడిన్ వెళ్లు చందమ్ములౌ
రవురా? భాగము పంచునాఁడె యుఁగరా ప్రారంభమర్యాదలన్

నలగాముండు ప్రలోభదూషితుఁడఁటన్నన్ వానిచందమ్ము ఱో
ఖుల రోఁకళ్ళను బాడిగార మెటు లాలోచించినన్ బాలుపో
దలఘుం డాయువరాజు నాగమకుఁ దోడై గుట్టుచక్కంగఁ ద్రం
పులు వెట్టించిన మాడ్కిఁ దోఁచు మలిదేవుల్ మాత్రమూహింపరే

మలిదేవుఁడు

బావా! మీ కెదురాడనోడెదను దుర్భావమ్ము మాభూరమా
దేవీపుత్రున కంటఁ గట్టకుము ప్రత్యేకింపరా దెవ్వరే
త్రోవల్ ద్రోకమమున్ మిమున్ గెడపనుద్యోగించినన్ కించలే
దావంతైన నదృష్టమున్నెడ నపాయమ్మైన సాయమ్మగున్.

అపకారమ్మొడఁగూర్పఁబంచిరనుమిందాయయ్యలే గెల్తురన్
వ్యపదేశమ్మొకఁ డున్నదా! విఫలులై వా రోడి పోవచ్చు మా
కుపకారమ్ము ఘటిల్లవచ్చుఁ గపటవ్యూహమ్ములన్ బన్నువా
రెపుడైనన్ జెడిపోక బాగుపడినారే మీర యోజింపుఁడీ.

పనిపైఁ బిల్చినఁ బోకతప్పదది సంభావ్యమ్ముగా దింక వే
యనుఁ దచ్చోటికిఁ బోయి తీరవలెఁ దామల్పాల కుంకించినన్
మనమా? తప్పవదిన్న వార మటఁ బ్రాణమ్మైనఁ గోల్పోవ వ
చ్చునుగానీ వెనుకంజవేయుటనినన్ శోచ్యమ్ము నైచ్యమ్ముగన్

బ్రహ్మనాయఁడు

అధిపుం డాడిన దెల్లవెంటలఁ దెలుంగైయున్న దందే యప
ప్రథమం జంకక పన్నిదమ్ములకు నాహ్వానింప మీఁదిక్రియన్
వ్యథగూరం దగ దిందయూచితము లాభం బున్న దేలందురా?
మృథమైచొప్పడు రాజ్యలక్ష్మి తమకో మీకో? వృథా సేకురున్.

వారికిఁ గోడిమేడ మనవద్యము హృద్యము తన్ని మిత్రమై
ధాగుణి సొంతమొడ్డెదరు తత్ఫల మొందు టటుండ నిం డసా
ధారణ లేగుదెంతురు యథార్థపరిస్థితు లాకళింతు రా
కూరుము లోరుమల్ దెలిసికొందురు విందురు తత్ప్రసంగముల్.

వలను గలట్టివారు మనపక్షము చేరినఁ జేరవచ్చుఁ ద
ద్బలము లెఱింగి వ్యూహములు పన్నినఁ బన్నఁగవచ్చు నన్నిటన్
మెలఁకువ లేర్పడున్ గడువుమించిన లాభము లేదు త్రోడుతో
వెలలవలెన్ బ్రగల్భుల భవిష్యము బైటఁబడున్ మతే మనన్.

కొల్వు గుబగుబలాడె వగ్గులకు సైత
మొడలు వెఱిగిన దింతల నుడువ నేల?

ఆమహోత్సాహసంరంభ మభినుతించి
కొమ్మరాజసుతుండు వాక్రుచ్చె నిట్లు.

పల్లెనాడు సొంత యిల్లిల్లు గాలించి
కుక్కుటమున కేమి? గ్రుడ్డు కేమి?
సంచకరువు లిచ్చి జనుల నూఁకొట్టించె
నెట్లు పన్నిదముల కెత్తువారు.

వారు కన్నుదెఱచి వర్తించు టరసియు
మీ రొడల్లు మఱచి మెలఁగినారు
ముగ్గు మీఁద బెడిసి మోహరించిననాఁడు
పట్టు పట్టు మన్న ఫలము గలదె?

ఇట్టి దుర్వ్యసనము లేప్రొద్దుఁ గూడదు
బుధు లెఱింగి వీని బొంతఁబోరు
దాయ లఱుమఁ జూచి నేయమ్ము వాటించు
రాలిగొందు రూలమాలగుడిపి.

బ్రహ్మనాయఁడు

అవుసలరాజ! నీపలికిన ట్లది క్లిష్టసమస్య జూదపుం
దవ్వులము పేరిటన్ శతవిధాలఁ బ్రయత్నమొనర్త మొక్కఁడన్
జివరకుఁ జిక్కకున్నె? మనచేరువ వీరపతాలుఁ డుండ నీ
వివరణ మెంతొ కిందులకుఁ బెట్టిన పేరనిసన్ సభాసదుల్.

పట్టము గట్టినట్లు పలుభంగులఁ బొంగుచు నంస్తుతించి రా
జెట్టిని బాదనాయఁడు వచించె నిటుల్ మను మేము పానుగల్
ముట్టడి సల్పివచ్చునెడ మోదుగరావులమధ్య నల్లతా
చట్టున రిక్కవేయు బెరసన్ గనుగొంటిమి దానిచెంగటన్.

తిన్ననిమేను, క్రొల్గనులు, తీర్చినబొమ్మలు సొమ్ము లన్నటుల్
వెన్నకు రూపువెట్టి రనిపించెడు కేమిడిచర్ల బాలగో
పన్నను పిన్నవాఁడు గనుపట్టెఁ దదాదరమేదురక్రియా
భ్యున్నతిఁగన్నుమిన్నెలియకున్నదియెమ్మెల తామ్రచూడమున్.

ఆయెడఁ గారుబొల్లని ఖురాగ్రహతిన్ సముదగ్రహేషలన్
లోయ ప్రతిధ్వనింపఁ బ్రదుటింకోఁ బెచుచట్టుప లార్చి కొక్కొరో
కో యని కూసి మార్కొనుటకుం దలపడ్డది కారుబొల్ల డా
చాయల నిల్వ జంకి రభసమ్మునఁ బాఱె నటల్ నడల్చుచున్.

కావునఁ బానుగ ల్దజిసి గ్రచ్చుర సచ్చరణాయుధంబునున్
దేవతె నాగసాని పస దేల్పవలెన్ దనమాడిక సంచక
ర్వ్వవలె నన్ను దుగ్ధ మన కెంపుల కాబిడ కైనచోట్లకుం
బోవల దాఁడుదాని కడివోయినఁ బౌరుష మేలకాల్పనా ?

లేదేని భండనమ్మే
నాదాటిచి పుచ్చు ననియె నాఁ డే దేవ్రుం
డా దొరకు నడ్డపడియెనొ ?
సాదుబలెన్ గుక్కుటప్రసంగము నడిపెన్.

అంత వీరపశాలున కానవాళ్లు
తెలిపి సభ్యులు కొలువాఁగి వెలలి రపుడు
అతఁ డిల్లన కన్న వాక్యములు వినక
పానుగంటికి నొంటిమైఁ బయనమయ్యె.

ఈసభాప్రవృత్తు లెటు లాకళించెనో?
వలనుగలుగు మోఱకులను బంచి
నాగసాని సంగనాచియై గురజాల
విభుని ప్రోల విఱ్ఱవీఁగుచుండ

దారి దప్పి చన్న వీరపశాలుండు
మఱులుఁదీఁగ మట్టుతెలఱ వెఱింగి
చిట్టడవి గమించి సెలయేటి దరిఁజేరి
కొసరి కొసరి నావికులను బిలువ

అదవద్రావి చీఁకు లాపోవ మొక్కుచు
వీనిగోడవ వారు వినరు కనరు
గోరక వెఱిగి నట్టు లుఱికి పైఁబడి తాను
చెలఁగి చీఁకు లేటఁ జిమ్మ క్రుమ్మ

వారు కవిసి రాసుతారమ్ము కొఱవడి
ఒడలు చెడిరి పడవ కుఱికి పడిరి
ఉదుటు సూపి ముందు కుఁకి పశాలుండు
నావ నీటఁ ద్రోసి నడపుఁ డనిన

చేయునది లేక కనుసన్న చేసికొనిరి
ఇరుగడన్ గడ లొత్తి ముందఱకుఁ బఱపి
రాకలాసులమర్మ మింతైనఁ దెలియఁ
దేటిమధ్యకుఁ దార్చి వాదించి రిట్లు

చీఁకులు దేకుంటివా? నీ
పోకడ నిజ మిందు ముంచి పోదు మఁటన్నన్
కాఁ కెక్కి పఠాలుండా
మూఁకం దెగఁబొడిచి నీరమునఁ బడనడఁచెన్

ఒడ్డగెడవైన పడవకు నోసరిల్లి
పఱవ కెదు రీఁది తిన్నఁగా వరవ దాఁటి
జిలుఁగుతడియాఱ నొక్కింత సేదదేఱి
దక్షిణాభిముఖుం డయి తరలిపోవ

సానుగంటి చుట్టుపట్టు నాల్గామడ
తన్నునొడియు బలియు రున్నయెడల
నిల్వదోఁపి డిత్తు నిరతసేవకుఁ జొత్తు
ననుగుఱాలమల్లుఁ డడ్డుదగిలి

తానిడ్డ వరివెంటి దాఁటినపాంథుల
పుట మార్తుఁ జుం డని బూకరించె
రాయవీరపఠాలుఁ డాయుబ్బులింగని
గైకొన కాపిరి గడవఁద్రోవ

నతఁడు వాలు మ్మని గుండె లవసిపోఁ జఱచిన
నితఁ డమాంతమ్ము పై కెత్తి విడిచె
అది దాఁటునం బుచ్చి పొదివి పట్టినతోన
మొలపునఁ జేయీక మెడమలంచె

తోరహాత్తమున న్వెన్ను దూాల నడవ
సీసకమ్మున ముంగాళ్ళు చేఁదివిడిచెఁ
గొంతతడ విర్వురిటు గొసగొనఁ బెనంగి
రుక్కసెడె మల్లుఁడు పతాలుఁ దొడిచె నతని

ఓడిన మిడుకుచు బిరుదము
లూడిచి చని మల్లుఁ డాత్మనుడుకు పతాలుం
దొడుగఱచి వెడవెడ బాము
లాడించి యొకింత తడవు సాలోచనుఁడై

వీరి ననిచి కార్యవిఘ్న మాపాదింప
నెంత లేసిపనుల కెత్తెజంత
అయిన దైవఘటన కధినాథు లెవ్వరు
పాలుపోక పడెడు పాట్లుగాని

అనుకొనుచుఁ గాలిబాటన్
జని చని పొదవులఁ గొండచఱిఁ బాడగాంచెన్
దనపౌరుషాగ్నికిం దో
డినబింబము పశ్చిమాద్రి నెఱ్ఱలు ద్రోలెన్.

శ్యామలకోమలశాద్వల
భూములు, తృణఖాదనప్రపుష్టోన్నతగో
స్వాములు, పరిణతసస్య
స్తోమము లలరించి ప్రకృతిశోభ వెలార్చెన్.

ఆ సంధ్యాతపకాంతికి
మోసులు నోర్విచ్చెఁ జివురుమొగ మెఱుపెక్కెన్
ప్రాసంగు వెనుసడల్చెను
దాసన మరుదార నెఱ్ఱదాళులఁ బొదలెన్.

ఈ మార్పు లరయఁ గవితా
వ్యామోహితుఁ డైన ప్రకృతివాదికిఁ దక్కన్
భూములు డీకొల్పెడు మన
స్వాముల కీ ఘట్టములు విచార్యము లగునే ?

కొంతతడ వేగి యతఁ డొక
వ్రంతం డిగి వార్చి యొడ్డుపట్టెనో ? లేదో ?
పొంతపొద లద్రువఁ బక్షు
లంతంత విదుర్చు కుక్కుటాగ్రణి దోఁచెన్.

భుగ్నకంఠధ్వనికి లోయ బూరటిల్లి
ప్రాంతర మ్మంత ప్రతిశబ్దబహుళ మైనఁ
బొదగదులునట్టు లది బొబొబో యటంచుఁ
దన్న దీ తీర్థమం దమూంతమ్ము వ్రాలె.

కనులు తార్కాణసేయకున్నను మనస్సు
నూలుకొన్నది తోడ్తోడ వీలుమెఱసి
చేరువ లతాకుడుంగముల్ దాటితాటి
ఉండ్రపాదమాటుగాఁ గాళ్లు లాడిసె నతఁడు.

ఒడిసినఁ గ్రేంకరించి పయి కుంకి మెడ న్నిగిడించి ముక్కునన్
బొడిచియు గోళ్ళ ఱక్కియుసముద్ధతిమైమయివెంచెఁగుక్కుట
మ్మ్రడుగ కతం డొడల్ నిమురుచున్నఁజివాలునలేచిగుంటిలోఁ
జెడుగుడులాడు బాలకులచెంగట వ్రాలెఁ బరాలుఁ డంతటన్.

వెనుకొని బాలురఁ బొడఁగని
మునుకొని కుక్కుటము నెత్తి ముద్దాడుబలా
ఘ్యృని దటీసి వీఁడె గోప
న్ననుకొని గతవిషయ మతని కావేదింపన్.

గోపన్న

వింటిమి పెద్దనప్రభృతి వీరులకున్ సరిదాఁకవచ్చుఁ బా
ల్గంటి కథల్ దురాగ్రహమునన్ దనతండ్రి నగళ్ళ పీనుఁగుం
బెంట లొనర్చి చన్న దిటఁ బిన్నలఁ బెద్దలనోర్చి మమ్ముఁ గై
కొంటకు మొన్నఁ దాఁ గనుపుకొట్టినవృత్తములింతక్రొత్తలే?

చివరకు వెల్మవీరుల ప్రసిద్ధి కొకించుక పానుగంటికో
ళ్ళవసర మయ్యె ధూర్తు లెటులైనను శీలమబ్రహ్మనాయనిన్
దవిలెద హానిసాత్త్వికవిధానము లాంధ్రజగత్ప్రసిద్ధముల్
ప్రవిమలచిత్తుఁ డిందఱుగ రానిది మే మిడ రాని దున్నదే?

కావున నేన నిల్చి మొనకట్టెద రేమిడిచర్ల వారికిన్
దీవన చాలుఁ గత్తినొఱదీయక గెల్తురు మేలుకీళ్ళకున్
దైవము ఖడ్గమ్ము సూచి మొగదప్ప రదేవనిఁ గత్తిఁగట్టినన్
జీవము లొసఁగచేయు రిఁక శీలమసింహము లేమిదేల్చునో?

ఈకుక్కుట మొండొకనిన్
డాకొన దానొంటి కొక్క దైవము లేదే?
నీ కైన తెఱంగు న నట
వాకొను మెడదవ్వఁగలుగ వత్తు మఁటన్నన్

మఱుమాటాడ కుదగ్గిశాభిముఖుఁడై మార్గమ్ముపట్టెన్ విజి
త్వరుఁడా వీరవరాలుఁ డంతట సజీవద్యూతతంత్రైకత
త్పరుఁడా గోపనవెల్మజోనులకథల్ వాక్రుచ్చుచున్ నెయ్యురన్
బురికొల్పన్ దల లూచి వానిజతనంబు న్మెచ్చి రుత్సాహులై

మొలక చీఁకటు లంతంతఁ బలుకఁబాఱ
నమృతకరుఁ డుదయాద్రిపై కపుగుదెంచి
తూరుపు బయళ్ళ వెన్నెల లూఱఁబోసె
నంతలో విశ్వమెల్లఁ బాలార్చికొనియె

పదువు రాసాంద్రచంద్రాతపమునఁ జేసి
శ్రమ దొఱఁగి నేరుగా నివాసముల కరిగి
నిదురపట్టక రేయెల్ల మదనపడిరి
పట్టు మని వఱువాతనే పయన మైరి

# నాయకురాలు

## ద్వాదశఖండము

తలక్రిం దైన మహాంధ్రమాఁడలికసంస్థానఁబు లందెంత మా
షఁ నా డీప్రళయమ్ము దాఁటి నిజసంపత్ సాప్రమోదమ్ములై
నిలువ న్నేర్చునె? తత్ప్రతాపమహిమానిర్ణిద్రగాథావళుల్
వెలయ న్నోఁచునె? ముందుముం దమరపృథ్వీవిప్లవజ్యోతులై

మతవిద్వేషముల న్నిరంతరము ధర్మగ్లాని సేకూర్ప దు
ర్మతు లెంతే వెనుకాడ రీశ్వరుని పేరన్ సాగు వైషమ్యసం
గతి కిర్వాఁగులు రాజ్యలక్ష్మి నిట రక్తస్నాన మాడింప స
మ్మతిమై నిల్చిన వేమిచెప్పుదుఁ దదున్మాదప్రమోదమ్ములన్

అనువారున్ వినువా రనాగరకు లన్యాయంబుగా మాప్రజా
ధన మీస్వాముల భోగలాలసకు ద్యూతక్రీడకున్ లోకమా
రణహోమమ్ములకా? దరిద్రులక్షుధార్తధ్వానవిభ్రాంతముల్
వినువీథుల్ ధ్వనియించుచుండ వినరావే వీరి కార్తధ్వనుల్.

కదనరథమ్ముమీఁద నలగాముఁడు నాయకురాలితోడ గ్ర
క్కదలఁదలంచె నెవ్వ రరికట్టెద రొప్పనితృష్ణగూరి ప
న్నిదములపేర నెత్తి రవినీతికిఁ జొచ్చిరి విప్లవప్రజా
హృదయము పిండలేని ప్రభువెందుకుఁ బాలనమెందు కేడ్వనా?

ప్రతిపదమ్మునఁ బ్రత్యక్ష భారతమ్ము
విలయవిక్రాంతిమైఁ దాండవించునాఁడు
పల్లెనాటి భవిష్యమ్ము బైటఁబడును
తెలుఁగుజోదుల పస తేటతెల్ల మగును.

అపు డపుడు రక్తచందన మలఁదికొనక
పునుకపేరులు దాల్పక భూతధాత్రి
కోడలు చల్లార దనిపించు చున్న దన్న?
పూర్ణ శాంతిస్వరూపమే బోధపడక.

ఐకమత్యపాఠ మభ్యసనీయమే
సభ్యజాతి జబ్బ చఱచుదనుకఁ
గమలజాండ మురక గబళింప నుంకించు
మనుజతృష్ణ మచ్చ మాసిపోదు.

ఈ సమస్యల కిరువీళు లీడఁబోక
ఒక్కపెట్టునఁ బఱచి చిచ్చుఱుకఁ దలఁచె
నాఁటి గురజాలద్యూతసన్నాహములకుఁ
బందలకు సైత మందంద పండ్లుపులిసె.

శ్రీచంద్రభాగనుద్వ
ద్వీచికలం గ్రుంకి వెలమవీరులు భక్తిన్
మాచర్ల చెన్నకేశవున్ గే
ల్మోడ్చి ప్రయాణించిరి గురజాలాపురికిన్.

ఇచట నుద్దండవీరభద్రేశుఁ గొలిచి
ఇష్టకామేశ్వరస్వామి నెద భజించి
గవఁకు లరసెడు నుగ్రభైరవున కెరఁగి
వచ్చికలివోయె గురజాలపట్టణంబు.

అందమైనవారలకుంట కెడన్
పంది శృంగమ్ము మోరపాకలు వెలసెన్
బందెము సలుపు నెపమ్మున
వందలు వేలై జనప్రవాహ మ్మొలసెన్.

వేత్రహస్తులు జడిసి పిర్వేఁకు సేయ
మొగ్గవిచ్చి ప్రజల్ ముచ్చముడిఁగి రంత
నుభయపక్షప్రధానులం దొక్కరొక్కరె
ప్రక్కసైగలబడి రంగ మెక్కినారు.

బుగ్గపుస్త్రీల కుప్పొంగిపోవువారు
గమవగాంభీర్యమునకు ప్రేల్లటచువారు
ననుపమానదయాదృష్టి కలదువారు
నై ప్రజల్ కొంద జీక్రియ వాడుకొనిరి.

ఔనౌ నితండు బ్రహ్మనాయఁ డాదర్శ
పూరుషుం డలఁతులఁ బోవువాఁడె
మిన్నుమ న్నిరు కేల మేళవించు వలంతి
మొగ మోడి మూర్ఖులఁ దగులువాఁడె
వలసిన నఱచేత వైకుంఠ మొఱగించుఁ
జలపట్టి పందెమ్ము చఱచువాఁడె
మాపాల వెలసిన మాఱట యతిరాజు
ధర్మ వావంతేని దప్పఁగలఁడె
మ్రొక్క బుద్ధివొడము మూర్తి విశేషమ్ము
పాపచిత్తు లెట్లు పఱపఁగలరొ ?
అయిన ధర్మ వెడల దనునెడ నాయురా
లుక్కుపిండు మట్టు లూడిపడియె.

ఆ చూపు చిఱునవ్వు కైనంతమాత్రాన
హంతకారుల మోము లింతలయ్యె
ఆ యూహా లించించు కంతుపట్టినతోన
పగరగుండెల నుక్కు-బాఁకు లాడె
ఆసాధువాదమ్ము లాకళింపక మున్న
మన్నీలపాగడీకల్ మిన్నుముట్టె
ఆహాస్తసంజ్ఞకు సాహొహొనినాదముల్
బడుగుఁ గైదను బరాబరు లొనర్చె

ఉదుటు చూపుల గరువమ్ము పదలపడఁగ
ఊహాలంభోధివీచులై యురవణింప
భూధవుని మ్రోల నాఁకొన్న పులివిధాన
నాయఁ డెదురుగఁ గొల్వయ్యె నాగసాని

నలగాముని పక్షమ్మటు
మలదేవుని పక్ష మిటుగ మధ్యన్ మాన్యత
స్థలమై యిరువాఁగుల కో
శ్శిలపై నిల్పినవి కత్తు లేర్పఱుపంగన్

మొకము లరయ కుభయులకు మధ్యవర్తిగాఁ
గొమ్మరాజసుతుని గోరికొనిరి
చేదు మేసినట్లు బాదన్న లోలోన
నుడికెఁ బూర్వవైర ముంటఁ జేసి

మువలభీము నవల మొనకట్ట నియమించి
నాగసాని పిఱ్ఱివిఁగ సాగెఁ
బానుగంటిజోదు బాలగోపన్నను
ఇవలివారు నిర్ణయించి రంత

కత్తిగట్టఁ బందెగాండ్రను గవ్వించి
ఇరు తెలుఁగులఁ బ్రోత్సహించుకొనిరి
వాలిచెడ్డకోళ్ళు నాయని వందుచే
నొట్టుపెట్టి నట్టు లాకఁము నిలడు.

పెద్దన్న కోడలు కంపించిపోయినది
నిలుపోపలేక నిప్పులు గ్రక్కినాఁడు
కన్నమ్మ బిలిచి గ్రక్కదలించినాఁడు
వాఁ డుగ్రుఁడై కోడిమేడమ్ము కత్తి
వింజాబెరసఁ జేఁది విడిచె నల్లంత
బుగ్గన్న చివ్వ బెబ్బులి కొళ్ళు నిమిరి
కఱకుజంజురు వెంట్రుకలు జీరుకాడఁ
దాడఁగొట్టి మీసాలు దువ్వి కవ్వించె
అవిరెండు చట్టుప లార్చి మైవెంచి
వెనువెనక్క కొడిగి ముందునకుఁ దారాడి
ఆకుంచితార్థపక్షాభిరామముగ
ఉవ్వెత్తు లేచి పైకుంకి పోట్లాడె
బెబ్బులి చెలరేఁగి బెగ్గోళ్ళఁ జీరి
బెరసజెక్కలు, డొక్క ప్రిదిలిపో నడఁచెఁ
దలక్రిందుగాఁ గోడి పిలుకుమూరఁగనె
నాయకురాలి సన్నకసన్ననిట్లు
జైనీసుద్దులు ప్రారంభ మయ్యె
మాచర్ల దొరవారి కోఁచకోళులకు
మీసాలతోఁబాటు రోసాలు లేవు
నామాలసాముల నడుమంత్రములకు
నామాలతోఁబాటు నీమాలు లేవు
విఱిగి పాఱుటె వారి వీరకర్మమ్ము

శరణుఁజొచ్చుటె వారి సమరధర్మమ్ము
బరిఁద్రొక్కి గెలిచిన పాపానఁ బోరు
పరు వెత్తి నిలచిన పరువునం బోరు
బంటుపగ్గెల కేమి? పంతాల కేమి?
లోకాల నాఁకట్టి డీకొల్పఁ గలరు
అని రుంజలఙ్ దట్టు నపు డొళ్ళు పెఱిగి
బాదన్న కటకటపడి పండ్లుగొఱికె
సూర్క్నిని కుఱుకెత్తి పోడుముట్టినది
పేర్నిసినాడు లుబ్బిన వింతలోన
ఆలిగొన్నవి నాయురాలి పాళెములు
చిన్నవోయినవి బ్రహ్మన్న పక్షములు
అయిన నాయఁడు జంకఁ డణుమాత్ర మేని
అది గని నాగమ్మ పెద"వాట్టె"విఱిచి
పందెమ్మ సఱతువా? బ్రహ్మనాయండ!
ఏ లేశ్వరపు రేవు లెత్తిపోయెదవ?
చీలమండకుఁ గాదు చిట్టేల రేవు
మీకష్టగాథల నూఁకొట్ట లేదు
వలనచరిత్రమ్మ వెలలింప లేదు
మాచర్లమూఁకకు మండాది రేవు
కొట్టినపిండి సంకోచింప నేల ?
పోటుబంట్లను మే.కపోతు గాంభీర్య
మలవడ్డ దనుచు బిట్టపహసింపఁగని

బాదనాయఁ డుదగ్రబా హాప్పళించి
ఎలపైకి గుప్పించె నలరా జదల్చె
బ్రహ్మన్న బాలగోపన్న నీక్షించి
*చిటిమల్లు నడరింపఁ జేసన్న చేసె
నరసింగరాజు నిర్ణయము సూచించె
మలిదేవుఁ డౌను మీ మాటఁ గా దనము
ఓడిన పక్షమ్ము లేడేండ్లదనుక
వసతులు విడనాడి వలసపోవలయుఁ
దిరిగి రాఁ బాలీక తీఱ దన్నాఁడు
నాకు సమ్మత మని నలగాముఁ డనియెఁ
గొమ్మరా జాత్మలోఁ గుత్సించుకొనియె
నలరాజు "సర్దుకొం" డని విన్నవించె
బాదన్న ప్రభృతులు వాదాడినారు
పలువురు దుర్భరాపదగూరినట్లు
మొకముల గంటువెట్టుకొని కూర్చుండి
రవల మువ్వలభీముఁ డీవల గోపన్న
పందెమ్మునకు సిద్ధపడిరి బ్రహ్మన్న
దీక్షమైఁ దన దివ్యదృష్టి సారించి
కనుఱెప్ప లార్పక గమనింపఁదొడఁగె.

* గోపన్నకోడి కిది బిరుదనామము.

చరణాయుధస్వామిబరి ద్రొక్కి నిల్చిన
వెరపుట్టి జోడంగి బెరసవాటె
కొక్కొరోకోయని ఱెక్క లల్లార్చిన
గుండెబెం డయు జాతికోడిపఱచె
ఉక్కుగోళుల గుండె లుచ్చిపోఁ దన్నిన
నీలిడే గల్లంత నేలఁగఱచె
ముక్కుడొప్పలఁ బక్షమూలముల్ చించిన
నాడులు తెగి పూరికోడి సురిగె
రేకమోవనీదు ఱెక్కార్చుకొననీదు
పొడువనీదు కాలుగదపనీదు
వెఱచి పఱచి నోరు విచ్చియుఁ జచ్చియు
గాయపడని దచటఁ గానరాదు

ఇంతవిచిత్రకుక్కుటము నెన్నఁ దెలుఁగము దీనిజన్మవృ
త్తాంత మభూతకల్పితకథాకలితమ్ము చరిత్ర కందదా
వంతయుఁ బామరప్రజల కద్భుతకల్పన లిష్ట మందుచే
ముంతకుఁ గాళ్లు కాళులకు మోములు మొల్చిన విట్టిపట్టులన్

చట్టున నుట్టిపడ్డ దనఁజాలము దీనికిఁ జేరిదేవి తోఁ
బుట్టు వఁటన్న నమ్మ మొకపోటున నర్వది యాఱుపల్లకీల్
మట్టిన దందు రియ్యది సమంజసమే? మదనాలచిట్టిమ
ల్లెట్లు జనింపనేమి? తుద కిద్ధయశమ్మున కయ్యె నియ్యెడన్

ఏ మా స్వైరవిహార మొక్కొకపడావే బాదనాదిప్రశం
సామోదమ్మున కైన దొక్కొకపు డాస్ఫాలించు నొక్కొకప్పు డు
ద్దామప్రౌఢిమ నుంతు నొక్కొకపు డుద్ఘాటించుఁ దద్విక్రమ
శ్రీమాధుర్య మెలర్చు నేత్రముల నాశ్లేషించె నాశ్చర్యముల్

నలగామప్రభుమోము ముచ్చముడుఁగన్ నాగమ్మ వెన్నాభమునన్
జలిచెమ్మల్ దిగువాఱె మాంత్రికులపజ్జం జేరి శాత్రేనిపం
పుల కెత్తించిన దాదురాత్మకులు నిల్వంగాళ్ళఁ గాత్రేనిబం
డలఁ దంత్రమ్ము లొనర్ప సాగి రపరాహ్ణం బయ్యె నీలోగఁ దఱ్ఱ

*రక్తధ్వజ మెత్తించి వి
రక్తిని సూచించు నాయురాలిం గని య
వ్యక్తము జరిగిన దని యు
ద్రిక్తుఁడు నాయుండు దివ్యదృషి మరల్చెన్.

బ్రహ్మనాయని కపు డైన భంగపాటు
బాదనాదుల కస లంతుపట్ట దయ్యె
బాలగోపన్న పసిపట్టి గేలిసేసి
చెఱఁగు మాసినకోడి వేంచేయవలయు.

మువ్వాలభీమా! శ్రీవా
రవ్వలఁ జనినారు మూఁక నాఁకట్టుటకా?
దవ్వుల విఱిగినఁ దప్పవు
కవ్వించినఁ దప్ప వెవరి గతు లెట్లగునో?

*నాయని నిషా దొలగించి గోపన నపరవ్రేయు నుద్దేశ్యము.

దృష్టి చెఱచి కొంతనష్ట మాపాదింపఁ
దివిరె నవసరములఁ దీర్పఁ గలదె?
బల్లి పలికి నంత నిల్లు కొల్లే రాన?
నమ్మరాదు మాచకమ్మ కొలువు.

పందెము కట్టు మింద మని పై కడరించిన చిట్టిమల్లు ము
న్ముందుకు సాగనీక బరిమోవఁగఁ దాఁకి ప్రతాపరెడ్డి భీ
ముం దలఁగించి నిల్చె బలుమో మయి గోపన చప్పరించె నం
దందఱు సమ్మతించి రపుడప్పుడ కత్తులు గట్టి రిర్వురున్.

టకటక లాడిపోయె బరి డగ్గఱె బిగ్గరఁ ద్రోపులాడి నల్
మొకము లమాంత మెత్తునెడ మోదముఖేదమునల్వలంకులం
దోకటఁ బరంజుకొన్న దపు డుబ్బున నాయకురాలి పక్షముల్
పకపకలాడె వీరి కొక*బాఁకులె లే వారగన్ నిజమ్ముగన్.

గోరఁబోఁజిన వడువున బోరవ్రీలి
నెత్తుప్రేవులు జీరాడ నింగికెగసి
నీలిడేగ నమాంతమ్ము కూలఁదన్ని
జీవములు వాసె మదనాల చిట్టిమల్లు.

చావ కెలదాఁటినది గురజాల పెంజ
చమరి బరిమీఁద నొరగె మాచర్ల పుంజు
ధర్మనిర్ణయ మనుకొన్న దనుకఁ గలదె?
కసరి నాగమ్మ ప్రేయించెఁ గంచుఢక్క.

* తదుద్రేకము మాత్రము సూచితము.

బాలవీరులతల నేలఁబడిన దపుడు
మల్లుదేవులు లోలోన మఱిఁగినారు
బ్రహ్మనాయని కమితవిభ్రాంతి దొడరె
బాలగోపన్న మాత్రము దీలుపడక.

కోపము ద్రింగలేక బుసకొట్టుచుఁ జట్టన కత్తిదూసి మీ
పాపము పండె రండు బరిపై నిలుఁ డెత్తునఁగొందు న్యాయర
క్షాపరతంత్రుఁ డంట నలగాముఁడు నాయకురాలు శైవదీ
క్షాపరురాలఁటే ? తెలిసెఁగా దమకృత్రిమచేష్ట లెట్టివో ?

కత్తి విమద్ధ మారెగ్రక్కదలఁ గట్టి
దడముగా నుక్కజాలియఁ దొడిగి కడఁగి
కొంచకీ క్రియఁ బందెమ్ముగొని రఁటన్న
దృప్తుఁడై భీముఁ డవల గద్దించుచుండ.

మాటటుగా శిర మ్మిటుగమాత్రము దోఁచిన దారగోపనా!
కాటుపులిన్ గ్రసించితివిగాని భవచ్ఛిర ముండ దంచు నో
క్కేటునఁ ద్రుంచి చూప అడలెత్తి వడంకఁ బ్రతాపరెడ్డి ద
బ్బాటునఁ బైఁబడన్ గలఁతపడ్డవి నల్గడ లొక్కపెట్టునన్.

బిరబిర నేగుదెంచి మొఱపెట్టు పడాళ్ల నదల్చి నాయురా
లఱుజుల గుట్ట లెక్కి రొద నాపి మహాజనులార! చూడరే
వెరవరి సేసినట్టి పిరువీఁకు తనంతట వచ్చి పందెముల్
చఱవఁగ నేల ? యోటుపడి జాతర సేయఁగ నేల ? జాల్ముఁడై

గెలిచితి మోడి రిం దొకరు కిప్పుడ నేల? కుతంత్ర మున్నచోఁ
బలువురు దేల్తు రీపశువు పైకొని భీముని చంపి చావనే
లలవు, చల మ్మెఱుంగ కిటులై రొఱగొడ్డెము లెన్నివిందుమో
తెలియము బాదమప్రభుల తీర్పులు మాయలరా జెటింగెడున్

కొఱకొఱదక్కిఁ మాయలొడఁగూర్చ్చసరుల్ పిలుపిచ్చవిద్యలన్
గఱపెద రాబడిన్ జమురు గల్గిన వా రొరులన్ గఁశింప రిం
దఱు మహనీయు లుండి రిది తప్పది యొప్పనరిట్టు లేకదా?
జరిగిన దంత నేఁడు తెరచాటున భాగవతమ్ములాడరే?

చలనము లేని నాకుడిభుజ మ్మొరగెన్ గురజాల రక్తపుం
గొలఁకుల స్నానమాడె నిరుగోపుల వారి కశాంతిబీజముల్
మొలిచిన వోడినట్టి జనముల్ నిముస మ్మిట నిల్వరాదుమీ
రలె సెలవిం డఁటన్న నలరాజు మొగ మ్మగయించు నంతలో

కన్నమ లేచి మిమ్ముఁ గరఁగం దిన మప్రియ మైన రాజ్యమం
దన్నము నీళ్లు ముట్ట మటులైన విషమ్మ గ్రసింతు మింకమా
కున్నది చీము నెత్తు రెవఁడో గతిమాలిన వాఁడు నీమక
న్నన్న మెలంగు నుమ్మసమునన్ బడిపోకుము పచ్చిబూతగున్

ప్రాలేయసౌధాగ్రడోలావిహారముల్
మలిదేవభూపతుల్ మఱచి రేమొ?
కఠినకారాగార కదనదృశ్యమ్ములు
మన్మనోవీథుల మలయు వేమొ?

విషసమ్మిళితచతుర్విధభోజనమ్ములు
శీలమ్మసుతుఁడు కాంక్షించు నేమొ?
ప్రాయఃప్రవృత్తశిలాయుద్ధగాథలు
పెదనాదు లాత్మభావింప రేమొ?
అనుభవజ్ఞు లింద అలఁతులం బోదురే
సిగ్గువిడుతు రేమొ? చెప్పలేను
అనదకూడు గుడిచి యభిమానము దొరంగి
నిన్నుఁ గొలిచి బ్రతుక నేర్తుమమ్మ!

అలరాజు

వాని నటుండ నింకు మనవా రిపు డోడిరి వారు గెల్చిరిం
దైన తెఱుంగు సేయుఁ డపహాస్యము లెంతకుఁ గావు విప్లవ
మ్మును సహింప ధర్మ మొకఁ డేస్థిర మేదెటు లైనఁబూర్వవా
గ్దానము దప్పరాదు గనుకన్ సకలమ్ము త్యజించి పోఁదగున్.
పాడి దప్పు నెడలఁ బరికింపవలెఁ గాని
మ్రుగ్గు మీఁది కింత మ్రొగ్గఁజనదు
కోడి వడినపిదప నాడిన ఫలమేమి?
ద్యూతవిదులు తొలివిధులు గణింత్రు

అయిన ధర్మార్థసంగత మభిలషించి
బాలగోపన్న ప్రాణముల్ గోలుపోయె
వలసినంత భవిష్యమ్ము గలిగి వెలుఁగు
బాలవీరుల కిది గుణపాఠ మంను

అక్కఁ గిమ్మన్న వ్యక్తి లే దాత్మ కలఁగి
బ్రహ్మనాయఁడు నలుగుభూపాలసుతులు
బాదనాదులు తక్కిన బంధువర్గ
మించుకించుక చేరి భాషించుకొనిరి.

మొక్క మెఱుంగని పద్మనాయకులు సైత
మకు గడుగు నంకుఁ గన్నీరు విడుచు టేమి?
బాలగోపన్న మృతకళేబరము నంటి
వలగొని నమస్కరింపనివారె లేరు.

అతని సమాధిశయ్యపయి కంపిరి తోడన జాలిగుండియల్
చితికి తపించి రా వెలమసింహములే యటులైన భీరువుల్
బ్రతికెద రా? సమస్తపరివారము తోడ్కొని మల్లిదేవభూ
పతులు ప్రయాణమైనపిదపన్ జను లచ్చెరువంది చూడఁగన్.

నలగాముం డలరాజు నాఁగి వినవన్నా! బంధుమర్యాదకై
నలునా ళ్ళుండరె? పోని విందలయి రెన్నాళ్ళుండరే? రాకపో
కలు లేకుండఁగ నేమి కాళ్ళు తెగెనా? కష్టాప్రధానమ్ముగాఁ
గలవాల మిత్రులైన నెట్టు లని వక్కాణించుచున్నంతటన్.

యువరా జాతని కేలు వట్టి సరి లెమ్మా కొమ్మరాణ్ణందనా?
అవుగాముల్ పరికింపు మంతరవు లేలా? బాల మద్దేవభూ
షప్రులున్ మే మొక్కండైన నల్లుఁడప్రయాథార్థ్యమ్ము యోజింపకే
ప్లుషకాళమ్ములఁ దప్పఁగుంక నగు సన్నా బాలగోపాలమున్.

నీకై సల్పిరి రాజబంధు లన సందేహించు తన్నెల్ల వా
రూఁకొట్టించిరి మోఁకఱించిరి తురంగోత్తంస మెక్కించి రా
పోకల్ చెప్పదరంబె "బాం" యనిడప్పుల్ తమ్మటల్ గుమ్మటల్
బాకా లొక్కట బోరుకల్గఁజని రాష్ట్రశ్రేణు లేతేరఁగన్.

అటు వారిటు వీరై రి
చ్చటఁదొడరిన తజ్జయాపజయములు మాత్ర
మ్మెటువోక నిల్చినవి యి
ప్పటికిన్ దత్పౌరుషప్రభాబహుళములై

ఆయుఋజుల గుట్టలలో
దాయల శౌర్యాగ్ను లడరి దరికొనకున్నన్
నాయనిగభీరతకు ది
గ్వాయువులే గుండె లవసి వలగొన నోడెన్.

వెలిదూదిపింజకట్టుల
బలె మైదానంబు నేత్రపర్వంబై సం
కులఘుంఘుమారవవ్యా
కులితనభోభాగ మగుచు గుబ్బటిలంగన్.

తెరలి తెరలి మూఁక లరవఱలై పోయెఁ
బ్రముఖు లందలములఁ బయన మైరి
పీరవిజ్జలాంక హారరత్నములతోఁ
బురము విడిచి నాయఁ డరుగునెడల.

ఓచెల్ల? యేమిపుట్టినో?
రాచఱిక మెన్నాఁటుపడియె రాజనుదమ్ముల్
యోచన డిగఁద్రావిరి తమ
పీఁచ మ్మణఁగున్ గుదుళ్ళు పేర్మాసిచనున్

బ్రహ్మనాయఁ డగ్నిపర్వత మయి పొల్చెఁ
శాప మెన్నఁ డుబికి బ్రద్ద లగునో ?
ఎఱ్ఱసెరల చెలువ మీక్షణరోచులఁ
గ్రుమ్మరించు నలుముఖమ్ములందు

ఆకంచుటీకె కన్నమ
డాకరమున శూలమును విడంబించుచు నాఁ
డోకగ నాల్కలు గోడెను
మూఁకల కోలెమ్ము తెరచి మృత్యువుభంగిన్

పెద్దన్నకారుబోల్లని
ఖుద్దున బలుమావు నెక్కి కోపస్ఫురణన్
గద్దించి జమునివశువున
నద్దెసఁజను వీరమల్లుఁ డతఁ డాగెడునే ?

పినమల్లు దేవనృపతుల
వినయము నయ మాత్మబంధువిశ్వాసంబీ
జనపతికున్నదె? దైవ
మ్మనుకూలింపక సమస్త మాహుతి యయ్యెన్

వీరి నిట్లుపఱపి విశ్వాసరహితుఁడై
పాముకొను న దేమొ? పార్థివుండు
అపల బ్రహ్మనాయఁ డివల నాయకురాలు
బ్రతికియున్న కార్యఫలము సున్న.

తమ్ముగుఱ్ఱ లిమ్ము దప్పినా రని సారె
చెప్పువారినోరు చేసుమేయ
వినెడువారి కెట్లు వీనులు వగులవో?
గులకలకలఁ గొంపఁ గూల్చుకొనిరి.

గొడ్డుఁబోతు గాక బిడ్డల గన్నచో
నిట్టి దుష్కృతముల కెట్లు గడఁగు
రాజు తాతబొమ్మ ప్రజ లమాయికు లంచు
మాఱుమూల లుడికి బోరు కలఁగె.

ఇరుతెగల పౌరపులకు మన
మెరియఁగ నలరాజు చని మహీపతి యంతః
పురపరిచర్యలఁ దేరిన
మరునిముసంబుననె భూరమానందనుఁడున్.

నాయకురాలుఁ జేరి నరనాథతనూజున కింపు పుట్టఁగా
నేయము, తీయము న్నెఱపి నేరుపుఁ గూరుపుఁదోఁపబల్కి ర
మ్మాయలు, మర్మముల్ చెవి నముచ్చి నిరుత్తరుఁడైననాయురా
లాయువుపట్లు దేల్చి యిటు లాడిన దోడక రాజనందనా?

మీరును వారు బాంధవులు మేముకదా? పెఱవాండ్రమందులోఁ
గూరిమి యల్లుగుఱ్ఱఁడవు కూర్చెడువాఁడవు తేవొ? మావొ? నీ
పేరునఁబల్లెనాడు నడిపింతురు నీకనుసన్నలన్ బరీ
వార మెసంగు నింద్రవిభవమ్ముల కొదు వి శేలచేద్పుడన్.

ఎఱిఁగి యెఱిఁగి కాదె? యీయర్థ మలరాజ!
అయ్యనకడకు నొడిసి రవలివారు
పైఁగ మిమ్ముఁ జేరఁబట్టి నాటక మాడి
రిట్టి దేరి కంతుపట్టకుండు.

పలనాటిరాజ్యలక్ష్మికి
నలగాముని పిదప మీరె నాయకులీ హా
కుఁలు నేఁటి వనకుఁ డధిపతి
తలిహారణము గానఁ గ్రమము దప్పదె యైనన్

పగమొలకలు లే రనియెడు
తగవులు ఘటియించినారె తక్కినతమ్ముల్
పగఁగూరు వారిఁ దేర్చన్
దగ వేదినయన్న కడుగుదప్పరు నేఁడున్.

మామ లింద అనుపమానబలాఢ్యులు
బలిసి కొలువ మాదృశులు భజింపఁ
బల్లెనాటి రాజ్యపట్టబంధురుఁ డవై
ముద్దుసేయఁ గోర్కి కద్దుమాకు.

సంప్రదాయబద్ధసప్తాంగనిర్మాణ
దక్షశిక్షకంబు ద్రావిడమ్ము
పల్లెనాటికందుఁ బ్రప్రథమస్థాన
మెవ్వ రాససేయరిద్ధమతులు

అలరాజు

నా కిరునాఁగు లొక్కఁ డయినన్ విను మీకడ మేనయత్తవా
రాకడ మామ లియ్యుభయు లెవ్వలనన్ గడఁద్రోవ రానివా
రేకముఖమ్ముగా నడచి రే నదిమీకును మాకు శ్రేయమీ
ప్రాకృతధర్మముల్ నొడువఁ బాలివియే యుచితజ్ఞురాలికిన్

అందును గొమ్మరాజసుతుఁడా? పితృదత్తము వీడి యుల్గురా
ణ్ణాదనదత్తరాజ్యభరణమ్మున కాసయొనర్చు? మీరు మే
మందఱ మైకమత్యమునకై కృషిసల్పుద మిష్టమైన చో
విందురు లేక తక్కుదురు వీరికి మాకొలు వేల? కాల్పనా?

తమ్ములు తా రతాకికపథమ్ములుపట్టి పెనంగు నామిష
మ్మెమ్మెయిఁగాంక్ష సేతుమది యింద్రపదమ్మయినన్ గ్రహింప మీ
ఱొమ్ముల కుంప పెవ్వరికెఱుంగనిదీ పెనురొంపిలోపలన్
మ మ్మిఁక దింప కమ్మ! వినమా? కనమా? మునుపడ్డపాటులన్

ప్రొద్దుపోదె వారి పోబడి తెలియదు
మాకునిచటఁ దడవు మసలరాదు

కాలొ౯లంది వారు గమిడి ద్రోకటేక మున్న
చేరవలయు నని వచించి లేచె.

చిత్తరువ్రుల మాడిక శ్రీవారు మూవురు
కొంతతడవు నిలచి రంతలోన
వింతమోములందు వెలఁది వెన్నెల గాసె
నంధతమస మొలసె నాత్మలందు

# నాయకురాలు

## త్రయోదశఖండము

మిట్టం బల్లముఁ గడచని
గుట్టపు దడ మూరి కివలఁ గ్రోశ మ్మడఁగా
నెట్టిలు ద్రోలెడు మంటల
కట్టాడక కదను ద్రొక్క నారంభించెన్

కనులు మిఱుమిట్లు గొన్నఁ బోకాలువారు
గుండెలు గతుక్కు మని చేఁదుకొన్నవారు
కాళు లీచగ దిక్కు మొగమ్ము లగుచు
దారి కొకఁడయి మాచర్లఁ జేరినారు

బాదనాడు లుఱికిపడి రేమి సేతురు
దొద్దకాంద్రు మున్నె దూసికొనిరి
బీతుగొలుపు పచ్చిపీనుంగు పెంటలు
వేఁడి రక్త మోలలాడఁ దొడఁగె.

బగబగ మను మంటలలో
మనువలఁబడి మ్రగ్గి స్రగ్గి మసిమసి యైరా
పొగ నమరు కమరుగాడ్పులు
మొగములు మొత్తినవి వాంతి ములుసూపంగన్.

ప్రతిగృహము రోదనధ్వాన బహుళ మయ్యెఁ
బ్రతిపదమ్మున బీభత్స పరిఢవిల్లె
నప్పు డాబాలగోపాల మారటించి
గొల్లు మన బాదమాన్వయుఁ డొల్లఁబోయి.

వారివారి పేరుపేరున నోదార్చి
సింధుమనము గలఁగి నిశ్వసించి
బాదనాదియోధ పరివేష్టితుం డయి
పురము కలయఁ దిరుగ నరుగు నపుడు.

పడఁబడఁ బాఱు క్రుచ్చు సిగఁబట్టి పదుఁడ్రిటఁ జేర్ప వాఁడ్లలో
నడలుచు నుగ్గడించె వినవయ్య! దొరా! చెనుపొట్ట కోసమై
మిడికితి మామె పంచినది మే మరుదెంచితి మిందులోన మా
దుమకుఁదనమ్ము దక్కఁ దన దోసము లేదెటు లాడిపోసినన్

ధనధాన్యంబులు కొల్లగొట్టుఁడు వృథా దర్పమ్ముకద్దంచు స్త్రీ
జనులన్, బాలురఁ వృద్ధులన్ దవిలి లేశంబైన బాధింపకుం
డని శాసించిన దల్లె లెం డని తదీయాజ్ఞానుసారంబె మే
మును వర్తించితిమీడనట్టిచెయిదమ్ముల్ సాగ క్షేమాత్రమున్.

వందలకొద్ది మేము నలువైపులు ముట్టినఁ గోటకావలుల్
కొందలమంది గుంపు లొడఁగూరిచి కేఁబడ్డిమంది గోసఁగెల్
ముందుకు సాగ నీ కెదురు మొత్తిరి మొత్తము గూలి తీవెసన్
గ్రుందిన మూఁకపై నడచి మార్గొనితార్గొని లగ్గపట్టినన్.

పిట్టగోడలఁ గన్నుగొట్ట నుంకించిరి
బురుజుల కెగఁబ్రాఁకి పొడుచువారి
నట్టాలకమ్ముల నణఁగిపో నేసిరి
గిలకపగ్గాల లంఘించువారి
"నోలు" వుండి గనపరాతుల గాడనేసిరి
గునపాల మగు లూడఁ గ్రుమ్మువారిఁ
గొత్తళమ్ముల సందుకొని గాయపఱిచిరి
గుబ్బతల్పులు గ్రుంగఁ గొట్టువారి
జాలు రువ్వి పంగరాగోల లడరించి
బల్లెములఁ దెమల్చి పట్టిచి చఱచి
భంగపడిరి దుర్గపాలకు లెనమండ్రు
త్రోఁచి నడచితిమి పదుండ్ర మవల.

నాచనగోపిసీఁడు వడిసన్ మొనకట్టు మగండు లేక చె
ల్లాచెదరైన గుంపులఁ గలంచితి మంతిపురమ్ము నల్గడన్
గోఁచలు గోలపెట్టఁ గలగుండువడెన్ వనితాసమూహ మా
రాచనగళ్లు మూసి బవరమ్మున కెత్తిరి వీరకాంతలున్.

అం దొకవీరనారి ప్రళయాంతకమూర్తి ముహూర్తమాత్ర మ
మ్మొదటఁ లక్ష్యపెట్టక జయార్థము వెంపరలాడిపోయె నా
చెందొవకన్నులన్ జివురుఁజేతుల వెల్వడు వెల్గు లల్గులున్
ముందఱ వెన్కలన్ నిముసమున్ దెరపీక పరంజె నొక్కటన్.

కూటు వేర్చి తోడరు గుండమనాయుండు
కూలు దనుకఁ గొంత కొంత పెనఁగి
కాళ్ళు, వ్రేళ్ళు, నెమరుకణఁతలు, పణతలు
పగిలి నొగిలి వెఱచి పఱచినాము.

స్త్రీలు గోల కెక్కి చిచ్చుఱికిరి గాని
“నస్పరీ” స్పృశించి నారె వారు
ముట్టి పలికినాఁడఁ గొట్టుఁడు కోయుఁడు
తథ్యమున కొకింత దప్పు ననిన

బగ్గన మండెఁ బెద్దన గుబాలునఁ బైకొనెఁ గన్న ముగ్రుఁడై
దిగ్గన లేచె లంకన పదింబది దూఱెఁ బతాలుఁ దండఱన్
దగ్గుఁ డటంచు నాయఁ డిది దైవకృతం బని నచ్చఁబల్కి కాఁ
దగ్గపనుల్ గొనుండని యథావిధినూల్కొలిపెన్ బ్రసన్నుఁడై.

మాడచి శుద్ధాంత మర్యాద నిలిపి
అరుల నూటాడించె నన్నమోదమ్ము
కన్నులఁ గాపాడు కొన్న మాచర్ల
మ న్నయి పోయిన దన్నఖేదమ్ము

రచ్చల కీడ్పించి రాజనందనుల
నన్యాయ మొనరించి రన్నకోపమ్ము
కడలేనిజంజాట ముడుగ కేడేడు
లడవుల నెట్టుందు మన్నతాపమ్ము
చేసేతఁ దీసి వైచినఁబాసిచనమిఁ
గడుపునఁ జెయివెట్టి కలఁచి నట్లుడికి
బ్రహ్మన్న లోలోనఁ బరితప్తుఁ డయ్యె
నాఁడు మర్నాఁడు నన్నము నీళు లనక
ఊసు నా డేకమై వారు పీ రనక
మంటలఁ బొరగాలి మడిసినవారి
దొమ్మికయ్య మొనర్చి త్రుంగినవారి
దేవీతటాకమ్ము దిగుదలం జేర్చి
దహనసంస్కారకృత్యము లాచరించి
మూఁడవనాఁ డింత ముసిముట్టినారు

నాఁటి సాయాహ్నమునకు మిన్నాగు లట్లు
మాదుగులరెడ్డిదొర లట కూడిపడిరి
తురగసంఘాతఖురసముద్ధూతధూళి
ధూసరాశావకాశవిన్యాసకముగ.

చటులభటకదంబసామర్థ్యమునఁ జేసి
పట్టణమునయందుఁ బ్రభుతఁ జాటి

రథిపసుతుల కవసరాదిక మెఱిఁగించి
కొంచ కరిగి విన్నవించి రిట్లు

నలగామప్రభు వన్నమాట లివి మాన్యంబైన దస్మత్కులం
బలుగుత్మ్నపతి మీకు మాకుజనకుం డాపుణ్యమూలమ్మునన్
బలనాటన్ స్థిరకీర్తి కైతి మిటు లైనన్ దప్పకీనాఁడె న
వ్వల పాలౌదుముముందు వెనకలగణింపుండాక్యచుర్యాదలన్

నిలు వెల్లన్ విషమున్న దెవ్వఁడెఱుఁగున్ నేఁడిట్లు బ్రహ్మాయ్యుత్రం
పులతోడన్ దెగి తెంపులై తిమతఁడేమెవ్వా? కూర్చ్వాఁడంచుబూ
వ్రలఁ బూజించితి మాత్మలాభమునకై పొంచున్న దావెల్మబె
బ్బులి మీకేక్రియ నంతుపట్టు నది తేపోమాపో? ప్రత్యక్షమా

ఎలపై నోడి మజేమొగమ్మున సమర్థింపంగ నేతెంతు మన్
తలఁపే మీహృదయమ్ములన్ వలదు రక్తస్పర్శ కీభేదముల్
గలవా? మంచికిఁ జెడ్డ కాదుకొనిచకఁ బెట్టుకోఁజూచుభ్రా
తలు లేరే? వల సీగి మీరుపడు బాధల్ సూచి సైరింతునే?

నరసింగప్రభుతోడి వారలుగదే? నా కెల్ల వా రెందు కీ
పోరపుల్ హాయిగ నిష్టభోగముల ముప్రాప్తి దెంతగానోసుఖా
భిరతిన్ దేలఁగవచ్చు దమ్ముల మనోభీష్టమ్ము లీడేర్పకె
వ్వరి కీరాజ్యము గట్టిపెట్టెదను సర్వస్వమ్ము మీరే కదా?

పరిపాటిన్ గమనించి యిప్పలునులన్ బాటింపుఁడీ తమ్ములం
దఱు మిమ్మెంబలె భాగలబ్ధికొఱ కన్నన్ నిల్వనన్ సాగదీ

యరు పోసం డటులైన నిప్పటికె పూజ్యంబైన పల్నాటిరా
జ్యరమావైభవ మింతలింత లయి నీఱైపోదె? నిర్వీర్యమై,

అలరాజాదులు బాంధవప్రియులు తోడై నిల్చి రిం కేమి? ర
చ్చల కెక్కింతుమటంచు నూహపడిరా? సంగ్రామరంగంబె తీ
ర్పుల కౌనస్రసమేత ప్రేతనిలయంబుల్ మాంసదుర్గంధగం
ధిలభూభాగము లేలుకొందు మిఁక సందేహమ్ములే దిందులో.

ఛలవృత్తమ్ములు మాని నన్నడుగుఁ డేసైన్యాధిపత్యమ్ము కా
వలెనన్నన్ యువరాజపట్టమునకై వాంఛించినన్ మంత్రివృ
త్తులు కాంక్షించినఁ దత్క్షణం బెతమ ముద్దున్ ముందు చెల్లింతురా
వలెనంచున్ బలుమాఱునొక్కి పలికెన్ భ్రాతృప్రియుండాదటన్

అలవోకన్ దనతప్పు లొప్పుకొని బ్రహ్మనాయఁడేమాత్ర మా
దలఁ బంకించినఁ జాలుఁ గీడ్పడ కమాత్యస్థానముందుండి "వై"
దొలఁగున్ నాయకురాలు తానొకరుఁడెంతో వైభవోపేతుఁడై
తొలిమర్యాదల కెక్కవచ్చుఁ గడుముద్దుం జేతురస్మాదృశుల్.

అనుపల్కుల్ చెవిసోఁకుచుండఁగనె బ్రహ్మామాత్యుఁడేతెంచె నా
రనుమానంపడి రాతఁ డన్యవిషయవ్యాసక్తచిత్తుండు కి
మ్మన లేదా మలిదేవభూపతులె ప్రత్యాఖ్యానముం జేయవ
చ్చిన త్రోవంబడి పోయి రా దొరలు రాజీమాలి వాజమ్మలై.

నాయం డంతట నవ్వె లెం డిదె ప్రయాణమ్మిర్రి మాడాది కీ
సాయాహ్నమ్మున కైనఁ జేరవలెఁ దాత్పర్యమున్ మూఁడు నా

ళ్యయెన్ భావ్యము కాదు చుండనఁ దదీయాజ్ఞాప్రకారంబె వా
రాయిత్తంపడి రూరునా డడలి హాహాకారముల్ సేయఁగన్.

తారు డెబ్బదిరెండుగోత్రాలవారు
సారెసారెకుఁ జెన్నకేశవున కెరఁగి
అవల మాచర్లపురలక్ష్మి కంజలించి
పాద మటు ప్రాణ మెటుగాక పయనమైరి.

చన్నవసి పిదుకుగోవులు
మున్నూ ఆత్మీయములు సముద్ధతి నడవన్
వెన్నడి లంకనప్రభృతులు
మున్నడి ముఖ్యులుగ నొకట-మూర్తము నడువన్.

మాచర్ల సొంత మచటికిఁ
ద్రోచి నడచి తన్నుఁ గడుపఁ ద్రోవకు మన్నన్
శ్రీచెన్నదేవుసాక్షిగ
ధీచతురత మెఱయ బ్రహ్మదేవుం డనియెన్,

కర్మఫలము కొలఁదిఁ గడగండ్లు దొడరును
వగవఁ దీఱ వెంతవారి కేని
మంచుబలె మసించి మబ్బుపోలె నశించుఁ
బౌరుషమున కులికి పడఁగ నేల ?

కార్యవాదు లష్టకష్టమ్ము లొందక
వలసినంత ఫలము వడయ లేరు

ఛావో? బ్రతుకో? తుదకు సప్తవర్షమ్ములు
కనులఁ గీలుకొలిపి కడపఁగలము.

మంది మార్బలమ్ము మసలిన సుఖ ముండ
దిత వెఱింగి నడుపుఁ డీమతంబు
బ్రహ్మచర్యవ్రతము పాటింప కున్నఁ ద
వీరగంధమునకు వీలుపడదు.

పదఁ డని నెయ్యము, తియ్యము
గదుర౯ మాచర్లప్రజల గ్రక్కదలిచి యా
కదుపులు మున్నుగ నాయఁడు
కదలె౯ నిజబంధుమిత్రగణపరివృతుఁడై.

నాఁటి వారిప్రయాణదైన్యమున కచట
బావురని ఱాతిగుండెలే బ్రద్దలైన
హృదయపుటభేదనమ్ముగా నిది మఱేది?
గట్లుతెగి పాఱెనింతగా కరుణరసము.

చంద్రభాగాగర్భజలతరంగశ్రేణి
సుడివడి లోలోన నడలసాగె
చెన్నదేవాలయశిఖరాగ్రకలశముల్
మలుపచ్చి కాటుక లొలుకఁబోసె

దివ్యగంగాతీర్థదేవీకటాక్షమ్ము
దరిదాట్టి గర్భము పొరలనేర్చె
రాజకేళీమందిరద్వారభూములు
పొలు పేది బిట్టు వాపోవఁ దొడఁగె
రాచకేవి గులుకు మాచర్లపుర మిట్లు
కన్నుమూసినట్లు కమరినట్లు
వేల్పువెరిగి నట్లు వెతగూరిన ట్లయి
కూడు నీళ్ళు లుడిగి గోడుగుడిచె.

ఈవగఁ గైకొన కెల్లరు
దైవము దూఱుచు విచారతత్పరమతులై
గ్రామాభిరామభూములు
సావరములు దాఁటి పోవు సమయమునందున్

అనుకూలవాయు వల్లల్లనఁ దోతెంచి
కమ్మనివాసనల్ గ్రుమ్మరించె
తెపతెప లాడ్చు సూర్యపుటమ్ము విప్పారి
చికిలినివేంద్రమ్ము పుకిలించె
వెలిమబ్బు గొడుగు నీడలుమింటఁ బరువెత్తి
వింతచల్లదనమ్ము విజ్జరాల్చె
పులకలై ప్రవహించు జలవేణికలు కొన్ని
జిలుఁగు పూఁదుంపరల్ చిలుకరించె

ప్రకృతి దయఁదాల్పకున్న భూపాలసుతులు
కాల్నడ గమింతురా? వీరి కష్టగాథ
లీ బయళ్లు చరిత్ర కందింపఁగలవు
తరతరమ్ముల వారి నోదార్పఁగలవు.

మల్లుదేవు లిట్లు మజిలీల తరబడి
నేలకొంగు లనక నిదుర సేసి
కాలిసడకమీఁద నేలేశ్వరపు రేవుఁ
జేరి విడిసి మకుగు చేసినారు.

కుడిచి కూర్చున్న దెచ్చట విడిసిచన్న
దప్పుడప్పుడె నాయురా లంతుదీసి
మాచుగులరెడ్డిదొరలఁ బోనాడినట్టి
వృత్తమునమాత్ర మొకకన్ను వేసియుండె.

ఓడు నెడ సమస్త మూఁచముట్టుగ దోఁచి
పోదలవలెనఁటన్న బుద్ధిఁ జేసి
మలచదంపు ద్రోలి మాచర్లభరతమ్ము
పట్టి తుట్టతుదకు వలసపంపె.

నాయనియాంతు విన్న మఱునాఁడె విచార మొనర్చి సానిస
శ్చాఝుని బిల్వఁబంచి తగువస్తువు లిస్తువులిచ్చి చూతుఁగా
నాయని బ్రహ్మచర్యవ్రతనాటక మే క్రియ భంగపుత్తువో?
పాయకుఁ బాయకెల్లఁ దలపోఁపు ఘటిల్లవలె న్నిజంబుగన్.

సుతునకుఁ దండ్రికిన్ దఱచు జోక్యము లే దపు డెప్పుడో పరి
స్థితి విషమించి పుత్రుఁ గడ కేర్పఁ దలంచినఁ బిన్నతండ్రి కీ
స్థితిగతు లర్థమై తిరిగి తెచ్చి పొత్తమ్ముగఁ బెంచెనందు రా
కత మనకేల? వాని నొడికమ్మున లోఁగొను మస్మదర్థమై.

పొమ్మని పుచ్చి వ్రేల్గఱచి బుద్ధిమదగ్రణు లిట్టిపట్ల నై
చ్యమ్మున రప్రగల్భు లని రన్న గణింపను రాజనీతి క
ర్థమ్మొకఁ డున్నదా? శతవిధమ్ముల బ్రహ్మనమంత్రిగర్వగం
ధమ్ము వొలంచుటే యభిమత మ్మది గైకొన రే జిగీషువుల్.

అన్న వ్యక్తి నేఁటి కరవిల్లినాగమ్మ
కార్యఖడ్గములకుఁ గలిగి వెలుఁగు
నామెశౌర్యగాథ లాంధ్రులవదనాగ్ర
వీథులందుఁ దాండవింపకున్నె ?

తత్సమాహ్వయప్రదర్శనవిజయమ్ము
పల్లె పల్లె దాట్టి వెల్లివిరిసెఁ
బ్రతి గృహమున నాగభామాప్రశంసలు
జల్లపరిగ గుబ్బతిల్లుచుండ

గురజాలన్ విజయోత్సవమ్ము జరిగెన్ గోరంత కొండంత గా
సరివా రొందెడు గౌరవమ్ములు కళాసత్కారముల్ బాంధవా
దరకృత్యమ్ములు ధీరవీరభటసన్మానమ్ము లన్నిన్ని గా
విరుగేలన్ వెదచల్లి రుల్లములఁ బ్రత్యేకాభిమానమ్ములన్.

దుర్జయాన్వయుఁ డానందదోహాలముగ
నృత్తగీతప్రశస్తగాణిక్యముఖ్య
గానరంగాతరంగాయమాణుఁ డగుచు
నవశరద్వేళ లీక్రియ నడపినాఁడు.

దర్పితాఖిలదిగ్వ్యూహదాహకముగ
నుగ్రశౌర్యాగ్నులన్ భూము లోర్చి పేర్చి
తా సరించమ విక్రముఁడైననేమి ?
చక్రమును ద్రిప్పెనదినాగసానితుదకు.

పరవైష్ణవసర్వారవిప్లవమ్ము
కల్లులో నొకపెట్టునఁ గత్తి దూసి
వీరశైవప్రతిష్ఠాప్రచారమునకు
నధికృతుల నేర్పఱచి బ్రహ్మరథముపట్టె.

నాఁడు పలనాటి నైదుఖండము లొనర్చి
సమునషు లొండఁగూర్చి ప్రాతినిధ్యము వహించెఁ
బ్రభుత సప్తాంగవృషసంఘబంధమయ్యె
ద్రవిడరాజ్యప్రవిష్టి కాదర్శమయ్యె.

చైత్రయాత్ర కమను చతురంగబలముల
నవసరోచితముల కలవరించె
నర్థబాధ లుడుప నాపమిత్త్వకధర్మ
మిరవుకొలిపె రాజ్య మెల్లకడల.

అప్రుషః దిశావకాశము లహర్నిశ మీయకవిల్లిభామినీ
ప్రపదము లాశ్రయించినవి ప్రాభవభాగ్యమదోపభోగులీ
కృపకుఁ దప మ్మొనర్చి రిఁకఁ గేవల మీపలనాటిలో నప
త్రప కయి వీరవైష్ణవకథల్ దలఁద్రాల్చిన వంధ్రభూములన్

నాగావాహినిశీతలోర్మికలలోనన్ జంద్రభాగానదీ
రాగోద్వేగతరంగపఙ్క్తుల సహోరాత్రమ్ము మార్మ్రోఁగుమా
నాగాంబాపరిపాలనాపయికసందర్భప్రశంసాదిక
త్యాగోద్దేశ్యకథాపదాంతరసముద్యద్విక్రమాటోపముల్

ప్రాతస్సంస్మరణీయభవ్యకవితాప్రాగల్భ్యసంపత్తి మ
చ్చేతోవీథులఁ దాండవించు నిటుపై శృంగార వీరాద్భుత
జ్యోతిన్ శ్రీమదఖండకావ్యరచనాస్రోతస్సులం దేల్చి య
ధ్యేతృస్వర్ణరథోత్సవమ్ము నెఱపన్ దీక్షించితిన్ సాధ్యమే?



ఓమ్

# కృ తి స్వీ కా ర ము

శ్రీఁగల భోగశీలురు ప్రసిద్ధివిలోలురు మాకుమా కటం
చేఁగతి మూఁగినన్ హృదయ మీని స్వతంత్రుఁ డొకింత మైత్రికే
లోఁగి విశిష్టకావ్యరసలోలుపబుద్ధికిఁ గానుకన్ వెట్టినాఁ
డీ గణనీయకావ్య మిది యెల్ల మదీయశుభోత్తర మ్మగున్.

ఈకవికావ్యమూలమున నిద్ధయశమ్మున కైనవారిలో
నాకును బాలుసేకుఱె మనఃపరితోష మెలర్చె నిట్టి సు
శ్లోకుల ప్రేమబంధములు, సూనృతవాక్యము లేకమై ఫల
శ్రీకము లౌను మాదృశుల స్నేహము లిన్నిటి కర్థవంతముల్.

అంచితరీతిఁ బ్రేమరస మాత్మఁ దొలంక, ఫలాభిలాష మొ
ఱంచక యేటుకూరి సుకవీంద్రుఁడు "నాయకురాలు" కావ్యమే
మంచి యొసంగినాఁడొ? హితమే యిరువంకల వారికిన్ సత
మ్మంచుఁ దలంచియుండుఁ దన కైన ఋణ మ్మిక నెట్టు లీఁగెదన్.

ధనికులు, రాజరాజు లని దగ్గఱి, సత్కృతు లిచ్చి నేర్పుమై
ధనము గడింపనొల్లక ముదంపడి మాదృశమిత్రకోటికిన్
జనవున నంకితమ్ము లిడి సౌహృదమున్ బ్రకటించి తౌర! నా
మన మిదె కానుకన్ వెట్టితిఁ జుమా? భవదీయహితప్రవృత్తికిన్.

సురుచిరకీర్తివై దిశల శోభిలు మాశశితారకమ్ముగా
సరసకవీంద్ర! నీదు రచనల్ నెఱజాను తెలుంగు వెన్నెలల్
గురిసిన నాంధ్రసంతతులకున్ గమనార్హము లైన విట్టి నీ
తెరువుల కిచ్చ మెచ్చితిఁ గృతిన్ ముదమారఁ బరిగ్రహించితిన్.

— జంపాల వేంకట నృసింహము